# సనాతన సారథి

ధర్మ శాంతి ప్రేమల ద్వారా మానవజాతి యొక్క
సామాజిక నైతిక ఆధ్యాత్మికాభివృద్ధి కర్పితము

సంపుటము 23 మే 1980 సంచిక 5

చిత్రము : కరుణాకటాక్షవీక్షణం।



### చందాదారులు గమనించండి!

మీ చందా గడువు ఏ నెల ఏ సంవత్సరమువరకు ఉన్నదో మీ చందా రసీదు కార్డులోను, మీకు నెల నెలా పంపుచున్న పత్రికపైనున్న విలాసము గల కాగితము లోనూ తెలుపుచున్నాము. దానిని గమనించి, ఆ నెంబరు "…/-6-''80 అనియుండిన, మీ చందా జూన్ నెలలో అయిపోవునని తెలుసుకొని, క్రొత్త చందా (సం॥నకు రూ. 6) మే నెల 31 వ తేది 1980 లోపల పత్రిక యొక్క కార్యాలయమునకు చేరునట్లు పంపవలెను

### —: శ్రీ వారి కార్యక్రమములు :

బాబావారు ప్రశాంతి నిలయము నందున్నారా అని తెలిసికొన గోరు భక్తులు పబ్లిక్ రిలేషన్స్ ఆఫీస్, ప్రశాంతినిలయము పోస్టు, పెనుకొండ తాలూకా, అనంతపురం జిల్లా అనే విలాసమునకు రిప్లయి కార్డు గానీ రిప్లయి పెయిడ్ టెలిగ్రాం గాని పంపవలెను. లేదా కొత్తచెరువు 36 నెంబర్‌కి ఫోన్ చేయవలెను.

సంవత్సర చందా 6 రూ ॥ గడువు ముగిసిపోవుటకు ముందుగనే మీ చందానంబరుతో చెల్లించవలయును.
వివరములకు అట్టలోపలి భాగములో చూడండి.




భగవాన్ శ్రీ సత్యసాయిబాబా

## 17

భారతీయుల వేద, వేదాంగాలు, ఉపనిషత్తులు, స్మృతులు, పురాణములు, ఇతిహాసములు మహావిజ్ఞాననిలయాలు. ఇవి గొప్ప గొప్ప పాలసముద్రాలు! పవిత్రజలాలు. సాగరములోని నీటిని ఎన్ని పంపుసెట్లు పెట్టి తోడినను ఈ షణ్మాత్రంకూడా తరిగిపోదు. ఎంతో నీరు సూర్యుని వేడికి కరిగి ఆవిరిగామారి మేఘరూపమును ధరించి ప్రజలకు వర్షరూపములో నీటిని తిరిగీ ఇచ్చుచున్నది. తద్వారా పంటలు పండి దేశము సస్యశ్యామల మవుతున్నది. ఎంతజలము ఆవిరగుచున్నప్పటికినీ సముద్రము ఒక్క అంగుళమైనా తరిగినట్లు కనుపించదు. అటులనే ఎన్నియో జీవనదులద్వారా నీరు సముద్రమును చేరుచున్నప్పటికినీ సముద్రము లవలేశమైనా పెరగడం లేదు. అటులనే మన శాస్త్రజ్ఞానముతోపాటు అనుభవజ్ఞానమును అందుకొన్న మహనీయులుకూడా సాగరములవంటివారు. వారిని ఎందరు భూషించినా, మరి ఎందరు దూషించినా, వారి చిత్తము నిశ్చలంగా నిర్మలంగా, ప్రశాంతముగా ఉండును. అట్టి సారమునకు నిలయమైనవే భారతీయశాస్త్ర గ్రంథములు.

అయితే ఎవరి ఓపికను పట్టి, సామర్థ్యమును పట్టి వారు ఆ జ్ఞానమును ఆస్వాదించవచ్చు, నేర్చుకొని మరీ ప్రపంచానికి విజ్ఞానమును వెదజల్లవచ్చు. అట్టివిజ్ఞాన, అనుభవజ్ఞానము ఒక్క భారతీయశాస్త్రములయందు మాత్రమే ఉన్నది. వాటిని బాగా అర్థముచేసికొనవలెనన్న అవగాహనగావించుకొనవలెనన్న సంస్కృతం తప్పనిసరిగా నేర్చుకోవాలి. సంస్కృతము అన

గానే మనలో చాలామందికి ఒక దురభిప్రాయము న్నది. అది మృతభాష అని. అది అనాగరి కులు సనాతనులు వాడే ఛాందసభాష అనీ ఈ నాటి వారి అభిప్రాయాలు. ఇవి ఏవో అర్థము కాని మంత్రాలనీ, యజ్ఞయాగాదులకు, పెం డ్లిండ్లూ, కర్మకాండలకు ఉపయోగించుకొనేవని, ఇది కష్టతరమైన భాష అని సామాన్య ఆధుని కులలో ఈ భావము పాతుకొనిపోయినది. ఈ దురభిప్రాయమును ముందు మన మనస్సుల నుండీ తీసివేయాలి. సంస్కృతము అమృత భాష అని, అమరవాణి అని, దానిలో ఉన్నది సమస్త భాషలయొక్క మూలసారమని అన్ని భాషలకు సంస్కృతము మాతృదేవి అనీ గుర్తిం చాలి. నిర్లక్ష్యము చేయరాదు. భారతీయుల వేదాలలోని అమృతాన్ని తనివితీరా త్రాగాలంటే సంస్కృతమును నేర్చుకోవాలి. వ్యాకరణం, ఛందస్సు, జ్యోతిష్యం మొదలైనవెన్నో అమూల్య మైన విషయాలను మహర్షులు ఎన్నడో వ్రాసి యుంచిరి. ఖగోళశాస్త్రం, ధర్మశాస్త్రం, నీతిశాస్త్రం తర్కశాస్త్రం, సంగీతశాస్త్రం, సాహిత్యశాస్త్రం, శిల్ప శాస్త్రం ఇంకా ఎన్నియో ఉన్నాయి. మన శాస్త్రా లను పాశ్చాత్యఖగోళశాస్త్రజ్ఞులు చూచి ఆశ్చర్య పరవశులై అనేకరహస్యములను వాటిద్వారా తెలిసికొనుటకు అనేకపరిశోధనలు చేయుచు న్నారు. భారతీయుల ఖగోళశాస్త్రము గ్రీకుల కన్నా ఎన్నోరెట్లు మిన్న అనికూడా పాశ్చాత్యులు పేర్కొన్నారు.

భారతీయుల ప్రాచీనవేదశాస్త్రాలలో ఆధ్యా త్మికసత్యమునేకాక ఈ నాటి అనేకవిజ్ఞాన సాంకేతికఅణుశాస్త్రముల రహస్యములుకూడా ఎన్నియో ఉన్నవి. అథర్వణవేదములోని అనేక భాగములను పాశ్చాత్యులు పరిశోధనలుచేసి గుర్తించిరి. భారతీయఋషులు వ్రాసిన నాడీ గ్రంథములను జాతకములను, జ్యోతిష, ఆయుర్వేద, రసాయనిక, విషవైద్యగణితశాస్త్ర ములుగల తాటియాకు గ్రంథములను టన్నుల కొలదీ ఏనాడో విదేశీయులు తరలించుకొనిపోయి నారు. మన, అనగా, భారతీయగ్రంథములైన శాస్త్రములను పరిశోధించే నిమిత్తము జర్మనులు ప్రత్యేకవిశ్వవిద్యాలయములు ఏర్పఱచిరి. అం దులో సంస్కృతమును నేర్పుచున్నారు. అమె రికా, రష్యా, కాబూలులలోకూడా సంస్కృత భాషను విశ్వవిద్యాలయములలో పెట్టవలెనని ఆసక్తిచూపుటయే కాక నిర్బంధముగా నేర్చుకొన వలెనని ఒత్తిడి తెచ్చుచున్నారు. భారతీయుల గ్రంథములు, మహాభాగ్యరత్నములుగా విదేశీ యులు భావించుచున్నారు.

పూర్వము భారతీయులు యోగశాస్త్రమునకు ప్రాముఖ్యతనిచ్చెడివారు. ఇప్పటికికూడా ప్రపం చములోని అనేకదేశములలో ఈ యోగశాస్త్ర మును అధ్యయనముచేయుచున్నారు. యోగా సనములు నేర్పు విద్యాలయములు నేడు అమెరి కాలో, రష్యాలో ఎన్నియోవెలసినవి. కానీ, భారత దేశములో, యోగాభ్యాసం, ధ్యానయోగం, అని, అనగానే ఇది ఏదో ఒక ఆధ్యాత్మిక మార్గమని వేదాంతపరమైనదనియూ భావింతురు. ఈ విష యం చెప్పగనే సహజంగా చాలా మందికి అర ణ్యాలలో పూర్వము ఒంటరిగా కూర్చొని, కాషా యవస్త్రములను ధరించి, కాయలు, దుంపలు, వేర్లు తిని జీవించే యోగులు గుర్తుకు వస్తుంటారు. యోగసాధనమనగా అట్టి బైరాగులు అభ్యసించే సనాతనవిద్య అని అభిప్రాయపడుచుందురు.

ఇది కేవలము ఊహాగానము కానీ, సత్యము కాదు. నేడు ఈ యోగశాస్త్రమును భౌతికశాస్త్ర విజ్ఞానదృష్టితో పరిశీలించి పరిశోధిస్తున్నారు విదేశీయులు.

ఈ నాడు ఈ యాంత్రికయుగములో ప్రశాంత జీవితమును కొనసాగించడం రానురాను కష్టంగా తయారగుచున్నది. రకరకమైన, మానసికవ్యాధులకు గురి అగుచున్నారు. అమెరికా ఇత్యాదినాగరికదేశములలోని ప్రజలు రాత్రి సహజనిద్రకు కూడా నోచుకోలేనివారలై నిద్రమాత్రలతో కృత్రిమ నిద్రను అనుభవిస్తున్నారు. వాటివల్ల అనేక గుండెజబ్బులు, రక్తపుపోటు వ్యాధులు అధికము చేసికొని కడకు ఆరోగ్యమునుకూడా పాడువేసికొనుచున్నారు. ఈ ఆధునికప్రయత్నము, యాంత్రిక జీవితాలు, ఇటు మానసింకగా, అటు శారీరకంగా శాంతి విశ్రాంతి లేక తికమకలగుచున్నారు. ఈ నాడు అధునికమగు మందులు కోట్లకు కోట్లు అభివృద్ధిఅయినప్పటికినీ ఏవియూ ఆ రోగములను కుదుర్చలేకపోవుటయే కాక నూతనరోగములను అభివృద్ధిగావించుచున్నవి. అందుకే మరికొంత మంది తెలివితేటలు గలవారు యోగాభ్యాసమే శరణ్యమని యెంచి ఈ నాడు అనేకపరిశోధనలచే గుర్తించి యోగాభ్యాసమును అభివృద్ధిగావించుచున్నారు చూచితిరా?

(సశేషము)

## "శ్రీ సాయిరామ సందేశమకరందము"

ఆ॥వె॥ పరమపురుష! షిరిడిగురువరుదివ్యాంశ
ధరుడ వీవు శాంతిధరను వెలుప
నవతరించినట్టి యవతారమూర్తివి
సాయిరామ! దివ్యశాంతిధామ॥

ఆ॥వె॥ నిత్య సత్య శాంతి నిర్మలంబులు నెంచు
ముక్తినొసగు నీదు ముద్దునుడులు
భక్తి రక్తిఁజిలుకఁబల్కనేర్పునువిమ్ము
సాయిరామ! దివ్యశాంతిధామ॥

ఆ॥వె॥ వాసిఁగాంచినట్టి వరకవీంద్రుడఁగాను
పాండితీవిశేష బలములేదు,
నీ పదాబ్జములను నెదనమ్మ భక్తుండ
సాయిరామ! దివ్యశాంతిధామ॥

ఆ॥వె॥ ముక్తినొసగు నీదుసూక్తులు ఛందమ్ము
నందుఁబొందుపరతు నందమలర,
దోషములనుఁబారఁద్రోలిఁగాపాడుము
సాయిరామ! దివ్యశాంతిధామ॥

# ఇది కారాగారమా?

అత్యంతదారుణమైన, క్రూరాతిక్రూరమైన నేరాలు చేసిన వారిని థాయ్‌లాండ్‌లో గాంగ్‌వాంగ్ సెంట్రలు జైలుకి పంపిస్తుంటారు. ఆ నేరస్థుల్లో చాలా మంది హత్యలు, దారిదోపిడీలు, మాతృహత్యపితృహత్యలు మొదలైన పైశాచికకృత్యాలకు శిక్షననుభవిస్తుంటారు. నేను ఈ నేరాల్లోవేటినీ చేయలేదు; కానీ సమాజంలో పైవర్గాల్లో జరుగుతున్న చట్ట విరుద్ధమైన కార్యకలాపాలు నాకు తెలిసిఉండడంవల్ల నాక్కూడా గాంగ్‌వాంగ్ కారాగారవాసం లభించింది. మహాశివరాత్రికి పుట్టపర్తి వెళ్లడానికి నేను ప్రయత్నాలు చేసుకుంటుండగా నన్ను పోలీసులు తీసుకుపోయి ఈ జైల్లో వేశారు. నా తల్లి నా రాకకోసం ప్రశాంతినిలయంలో ఎదురు చూస్తుంటుంది. నేను ప్రశాంతినిలయం చేరుకోక పోవడం ఆమెకు ఆందోళన, విచారం కల్గించిఉంటాయి. జాబు వ్రాయనివ్వక పోవడంతో నా సమాచారంకూడా ఆమెకు చేరేవీలులేకపోయింది.

రెండు దశాబ్దాలుగా ఎన్నో కష్టాలపాలై, ఎన్నో త్యాగాలుచేసి కట్టిన నా జీవిత సౌధం, కూలిపోయింది. పరులకు కన్నుకుట్టేటంత జీతం తెచ్చుకుంటూ ఒక కంపెనీలో పెద్ద ఉద్యోగం చేసే నేను ఒక్క రోజులో బిచ్చగానిగా మారిపోయాను. నా జీవితంలో వచ్చిన ఈ విపరీతమైన మార్పుకు తట్టుకోలేకపోయాను. కావలసినంత పలుకుబడీ, హోదా ఉన్నప్పటికీ నా "స్నేహితులు" "అభిమానులు" నన్నీ పరిస్థితినుంచి తప్పించడానికి ప్రయత్నించలేదు; నా దగ్గరికికూడా రాలేదు. నా బంధువులు చాలా దూరంలో ఉండిపోయారు. ఇట్లాంటి అవాంతర పరిస్థితులనెదుర్కోవడానికి కావలసినంత డబ్బు నేను ప్రోగు చేయలేదు. నేను బ్రహ్మచారిని. నా సంపాదనలో చాలా భాగం నా పెంపుడు పిల్లల సంక్షేమానికి వినియోగించడంవల్ల ఈ విపరీతపరిస్థితిలో చేతిలో చిల్లిగవ్వ లేకుండా పోయింది. ఈ విధంగా నేను స్వేచ్ఛ లేక, ధనం లేక, స్నేహితులూ బంధువులూలేక అంధకార స్థితిలో పడిపోయాను.

దాదాపు నెలరోజులు ఆహారానికేకాక కనీసావసరాలకుకూడా చాలా కష్టపడాల్సి వచ్చింది. నాకుఇచ్చే భోజనంలో ఉప్పుండేది కాదు. ప్రశాంతినిలయపు పవిత్ర ఆవరణంలో అడుగుపెట్టిన నాటినుండి శాకాహారిగా ఉండాలని నిర్ణయించుకోవడంతో ఆహారానికి మరింత కష్టమయింది.

మొదట్లో నన్ను నేనీవిధంగా ప్రశ్నించుకొన్నాను. "నా కిలా ఎందుకు చేస్తున్నావు బాబా? నన్ను నీవు ప్రేమించడం లేదా? నీ అభయహస్తాన్ని నా దిశ చాచి ఈ విపత్కరపరిస్థితినుంచి నన్నేల కాపాడ్డం లేదు? నీ సందేశం ఈ ప్రాంతంలో వ్యాపింపచేయాలని నేను వేసికొన్న పథకాలసంగతేమిటి? గతిలేని నా పెంపుడు పిల్లల జరుగుబాటు ఎవరు చూస్తారు? నాకు కావాల్సి అక్కర్లేకో, తెలిసో తెలియకో, చేరవేసిన లారీలకి లారీల సామానుగతి ఏమి కావాలి? దాదాపు ఎనభై ఏళ్లు పైబడ్డ నా తల్లితండ్రులను తిర్గి నే చూడగలుగుతానా? అన్నిటికంటె విచారకరమైనది నా సద్గురువైన స్వామికి అంజలిఘటించడానికి పుట్టపర్తి దర్శించలేక

పోవడం! స్వామిని మొట్టమొదటసారి దర్శించాక, ప్రతిసంవత్సరము తప్పకుండా ఒకసారి (వీలైతే ఎక్కువ సార్లుకూడా) భగవానుల దర్శనానికి ప్రశాంతి నిలయం పోవాలని నిశ్చయించుకొన్న నాకు ఈ బంధనం చాలా బాధకల్గించింది. స్వామి అనుగ్రహవీక్షణ ద్వారా సాధనలో మునిగి సత్యసాయియుగంలో సాయి దూతగా జీవితం కొనసాగించాలని ఆశయం పెట్టుకున్న తర్వాత, ఆ ఆనందానికి దూరం కావడం చాలా ఆవేదనా పూరితమయింది.

జైలులో గడపిన మొదటి మూడు రోజుల్లో మండుటెండలో కష్టపడి పనిచేసినదానికి ఫలితంగా నా ఎడమకాలు ముడుసుమీద ఒక గడ్డ ఏర్పడింది. దాని పర్యవసానంగా జ్వరంకూడా వచ్చింది. ఆ దెబ్బతో మూడు నెలలు కాలు కదపడానికి వీలు పడక మంచం పట్టాను. డాక్టర్లు బహుశా ఎముక దెబ్బ తినడం జరిగిందనీ, దానివల్ల కాలు తీసివేయవలసి రావచ్చనీ నన్ను భయపెట్టారు. ఆస్పత్రిలో గడపిన కాలం (బాబా పంపిన గడ్డవల్ల) నా బాధలను తొలగించి వాటి పట్ల సరియైన దృక్పథం పెంపొందించుకోవడానికి తోడ్పడింది. కారాగారపు ఆస్పత్రిలో పడుకొని నా కష్టాలగురించి తీవ్రంగా తలపోయసాగాను. అప్పుడు నాకు జ్ఞానోదయమయింది. ఈ కష్టాలవెనుక నా కరుణామూర్తి ప్రేమ హస్తపుక్రీనీడ కనపడింది. ఈ సత్యాన్ని కనుగొనడంతో నా కష్టాలన్నీ మాయమయి నాకు స్వేచ్ఛలభించింది.

తిర్గి నన్ను నేను ప్రశ్నించుకొన్నాను. "నాకు ఏమయింది? ఈ జీవితం అంత చెడ్డదా? గత ముప్పై సంవత్సరాలనుండి నన్ను వేదిస్తూ నాలోపెరుగుతూ వస్తున్న బాధలు నానుండి దూరం కావడం నీకిష్టంలేదా? నా జీవితంలోని ఈ రకరకాలయిన వ్యథలనుంచి నన్ను దూరం చేయు" మని భగవాన్‌ను నీవు ఎన్నో దినాలనుండి ప్రార్థించడంలేదా? నీ ఉద్యోగవ్యాపారాల్లో మార్పుకోసం ఎన్నో రోజులుగా తాండవిస్తున్నావు. విశ్రాంతికీ, యాత్రలకూ నిద్రకూ, తీర్థయాత్రలకూ సమయం చాలక చాలా రోజులుగా సతమతమవుతున్నావు? నీ ఉద్యోగవ్యాపారాల్లో నీ తప్పుడు లెక్కలవల్ల కల్గిపోయే అనర్థాన్ని యిట్లాంటి మహిమ మాత్రమే నిన్ను కాపాడకలదు. తన రెక్కలక్రిందకు తీసుకొని నిన్ను కాపాడినందుకు వారికి (స్వామికి) కృతజ్ఞుడవై సంతోషించు.

ఒక దెబ్బతో బాబావారు నా కష్టాలను, బాధలను తొలగించివేశారు. వారు నన్ను బాధాపూరితమైన, తుచ్ఛమైన, గందరగోళభరితమైన ఆ ప్రపంచమునుంచి పైకిలేవనెత్తారు. అంతేకాక నా మనస్సును సానపట్టి మెరిసేట్లు ఈ ''గుడి''లో దాచారు. సర్వజ్ఞుడైన, సర్వశక్తిమంతుడైన, సర్వవ్యాపియైన, సర్వజ్ఞానియైన భగవానులప్రేమయొక్క వెచ్చతనాన్ని నింపిన ఒక రకమైన అనుభూతిలో తేలియాడ్డం ఆరంభించాను. ఎందువల్లనంటే స్వామి ''నేరస్థుణి శిక్షననుభవించడానికి జైల్లోతోపి తాళమువేసిన వారు, నేను ఆ నేరస్థుడికి శాంతి, శ్రద్ధ, భక్తి అందచేయటానికి ఆ జైలులో కూడా ఉన్నాననితెలుసుకొని ఆశ్చర్యచకితులవుతారు. అక్కడ ఉండటమేకాక, ఆ గాయ పడిన హృదయాన్ని సరిచేస్తూ, వ్యాకులితమైన మనస్సును సర్దుతూ, జాగ్రత్తతోనిండిన అంతఃకరణమందు అమాయకంగా బాధననుభవిస్తున్న తప్పుచేసి మరోసారి ఆ తప్పుచేయగూడదని నిశ్చయించుకొన్న చంటిపాపలో నేను ఉన్నసంగతి బయటి వారికి ఆశ్చర్యం కల్గిస్తుంది'' అంటారు. చివరికి నాకిక్కడ మనశ్శాంతిదొరికింది. అట్లా అనడం అబద్ధంగా ఊహాకందనిదిగా నమ్మజాలనిదిగా తోచ

వచ్చు. సరిగా విశదీకరించి, ఊహిస్తే నేనాపరిస్థితిలో ఉన్నాను.

అన్నిటికంటే ముఖ్యంగా ఆర్థికపరమైన చిక్కులను తొలగించే బాధ్యత నా భుజాలమీదనుంచి తొలగిపోయింది. 1976లో ప్రశాంతినిలయంలో స్వామి ఇంటర్వ్యూ ఇచ్చినపుడు స్వామిని ఈ విషయం గురించి అడుగుదామనిపించింది. కాని, అడగనప్పటికీ స్వామి నా భుజంమీద ప్రేమతో తట్టుతూ" నువ్వు నీ స్నేహితులకిచ్చిన బదుళ్లు నీకు తిర్గిరావు. అయినా చింతించనక్కర్లేదు. అంతా సవ్యంగానే ఉంటుందని" చెపుతూ నా తలపై దివ్యహస్తముంచి దీవించారు. నిజానికి నేను నా ఆర్థిక చికాకులను గురించి స్వామికి విన్నవించి వాటినుంచి తొలగిపోయేమార్గం అడుగుదామనే పుట్టపర్తి వెళ్లాను. స్వామి సంకల్పించినరీతిగా ఆ చీకాకులు ఇట్టే, తొలగిపోయాయి.

దినానికి పదమూడు పద్నాలుగు గంటలకిపైగా కష్టపడి పనిచేయాల్సి వచ్చే ఉద్యోగవ్యాపారం సమస్యా, మీదుమిక్కిలి ఏదో ఒక సదుపాయం కల్పించమంటూ వచ్చేగిరాకీదారుల సమస్యా దూరమయ్యాయి తగినంత నిద్రా, భోజనం, విశ్రాంతీ, నేను ఎన్నడూ అనుభవించలేదు. నా ఆరోగ్యం చాలా దెబ్బతిన్నా నేను దానిని గురించి పట్టించుకోలేదు. అట్లా ఇంకా కొనసాగిన పక్షంలో జీవితమంతా ఆస్పత్రిలో గడపాల్సివచ్చి ఉండేది.

నాకండ్లూ, గొంతుక, కడుపూ అనారోగ్యంగా ఉన్నాయని చెబుతూ, బాబావారు కొంచెంతెల్లటి మందు పొడిని సృష్టించియిచ్చి తినమన్నారు. అది చాలా చేదుగా ఉండింది. స్వామి దివ్యసంకల్పం వల్ల వచ్చిన ఈ విపత్పరంపరవల్ల నేను శారీరకంగాను, మానసికంగాను చాలా ఆరోగ్యంగా ఉన్నాను. నేను చేయవలసిన శారీరకశ్రమవల్లకూడా నా ఆరోగ్యం మెరుగయ్యింది. స్వామి చెప్పే "work is worship" (పనిచేయడమే పూజించడం) అనే భావనతో ఆపనంతా చేస్తున్నాను. మమ్మల్ని సాయంత్రం ఐదుగంటలకి జైలు గదిలోపెట్టి తాళంవేసి ఉదయం 6-30 గంటలకి బయటకి వదుల్తారు. దగ్గర దగ్గర 13 గంటల సమయం. స్వేచ్ఛగా నాకు లభించిన రెండు చదరపు గజాలనేలలో ప్రార్థనలోనో, ధ్యానంలోనో, స్వామి వ్రాసిన పుస్తకాలు చదవడంలోనో, యోగాభ్యాసంలోనో గడపడమేకాక దాదాపు ఆరు, ఏడు గంటలు గాఢంగా నిద్ర పోతాను.

మెళకువగా ఉన్నసమయమంతా కారాగారం బయట గల తుచ్ఛమైన వాతావరణానికి సంబంధించిన ఆలోచనల దిశపోకుండా జాగ్రత్తపడతాను. ఒకొక్కసారి వ్యాకులతకాలవాలమైన నా మనస్సు, సాయిమాత హస్తాలలోవ్రాలి తిర్గి పునర్జీవితయి ఉత్సాహ భరితమవుతోంది. అపుడు నాకు విశ్రాంతికి, పారాయణము నకు నిద్రకు చాలినంతవ్యవధి లభిస్తోంది. కావల్సినంతసేపు సూర్యరశ్మిలో సంచరించి, వీలయినంత పరిశుభ్రమైన బాబా గాలి నాస్వాదించుచున్నాను. ఉదయం సాయంత్రం యోగాభ్యాసం చేస్తున్నాను. ప్రతిరోజూ దాదాపు రెండు గంటలసేపు ఇద్దరికి విద్యాబోధన చేస్తున్నాను. దానివల్ల చాలా విషయాలలో నాకున్నజ్ఞానం పెరిగింది. వీటన్నిటికంటే ముఖ్యం వేయికి పైగాఉన్న ఖైదీలూ, రక్షకభటులూ నా పట్ల ప్రేమతో గౌరవంగా ప్రవర్తిస్తారు. తరచుగా నాకు "ఇది కారాగారమా!" అన్పిస్తుంది. ఆ సమయంలో "కాదు! కాదు ఇక్కడ బాబావున్నారు" అని గుర్తు చేసుకుంటాను.

నా పెంపుడు పిల్లల సమస్యకొంత వ్యథ కల్గిస్తూ

ఉంటుంది. నా దగ్గర చాలినంత ధనం ఉండడంతో వాళ్లకి అవసరమయిన దానికంటె ఎక్కువ ప్రేమ, సౌఖ్యాన్ని ఇచ్చి వాళ్లని కొంత పాడు చేసాననిపించింది. వాళ్లందరిలోకి పెద్ద పిల్ల, నేను, కోరినవన్నీ సమకూర్చినప్పటికినీ సంతోషం వ్యక్తం చేసేదికాదు. ఆమె మురికి వాడల్లోనుంచి సుఖసంపదలమధ్యకి ఎత్తబడింది. తరచు ఆమె ఈ ఆడంబర వస్తుసంపదల మధ్య జీవించటంకంటే, పేదతనంలో బ్రతకడమే మంచిదని" చెబుతూ ఉండేది. నా సంపదల్లో ఆమె అభిలాషనూ ఆసక్తినీ వ్యక్తపరచేది కాదు. ఇప్పుడు నేను ఆమె మాటలవిలువను గుర్తించాను. ఈ అనాథ బాలిక 1976 లో నాతో మొట్టమొదట పుట్టపర్తి దర్శించింది. ఆమె భగవాన్ దర్శన, స్పర్శన, సంభాషణ భాగ్యం పొందిన అదృష్టవంతురాలు. అంతకు మొదటా, తర్వాతకూడా ఆమెకు వింతఅనుభవాలూ, వివిధ దృశ్యాలనూ స్వామి ప్రసాదించారు. ఒక స్వప్నదృశ్యంలో బాబా ఆమెకు తమ దివ్యహస్తములతో ఒక మగ బిడ్డను అందచేశారు. ఆమెకు తదుపరి పుట్టిన మగ పిల్లవానికిప్పుడు రెండు సంవత్సరాలు. ఆ పిల్లవాడు బాబావార్కి భోజనం అర్పించడమేకాక, ఓంసాయిరాం అని పండుకునేముందు నామస్మరణకూడా చేస్తూంటాడు. ఆ పిల్లవాడు పెరిగి పెద్దవాడై స్వామి బోధలను తన ఊర్లో ప్రచారం గావించే ఆదర్శయువకుడుగా తయారవ్వాలనేదే నా ఆకాంక్ష.

నా పెంపుడు పిల్లలలో చిన్నామె స్థానిక ఆస్పత్రిలో తల్లితండ్రులచే కని వదలిపెట్టబడిన అనాథ బాలిక. ఆమెకు మూడురోజుల వయస్సప్పుడు నా సంరక్షణలోకి తీసికొన్నాను. ఆమెను తీసికొనే సమయంలో స్వామి పటం ముందు నిలబడి ఆమెను భగవాన్ పాదపద్మముల కర్పించాను. ఆ క్షణమే ఆమెకు భారతదేశంలో శ్రీ సత్యసాయి విద్యాసంస్థల్లో పూర్తి విద్యాబోధన ఇప్పించాలని సంకల్పించాను. ఆమెకి ప్రస్తుతం అయిదు సంవత్సరాల వయస్సు. స్థానిక పాఠశాలలో చేరి ఆయా చెప్పుచేతల్లో పెరుగుతున్నది. ఇరుగు పొరుగు వారు, దయాహృదయులూ ఆమెకు వలసిన బట్టలూ, మిఠాయిలూ, బొమ్మలూ ఇస్తుంటారట. ఆమె చురుకుదనం, తెలితేటలూ అందర్నీ ఆకర్షించి ఆమెపట్ల ఇష్టం కలగచేస్తాయి. ఆమె భవిష్యత్తును బాబావారికే వదలి వేస్తాను. మిగిలిన పిల్లలు నా ఆధారం లేకుండా తమకాళ్లపై తాము నిలబడగల స్థాయికి చేరుకున్నారు. స్వామి అనుగ్రహం వల్ల ముగ్గురు తమ జీవితంలో స్థిరపడి మిగిలినవారికి వేణ్ణీళ్లకు చన్నీళ్ల మాదిరి సాయం చేయగల స్థితిలో ఉన్నారు.

నా తల్లితండ్రులు తృప్తికరమైన ఆరోగ్యం కలిగి ఉత్సాహంగా జీవిస్తున్నారు. స్వర్గస్థులయ్యే ముందు వారిని నేను కలవాలనేది స్వామి సంకల్పమయితే తిరిగి వారిని చూడగల్గుతాను. స్వామి సంకల్పం దానికి అనానుకూలంగా ఉంటే, ఎంత బాధకల్గించేదయినా ఆరీతిగానే నేను స్వీకరిస్తాను.

నా ఆస్తిపాస్తులసంగతేమిటనా? స్వామి "వదలించుటకు లాభపడు. త్యజించి ధనవంతుడివికా" అంటారు. మాయిల్లుగలాయన యింటిబాడుగ బాకీ చెల్లించనందుకు నా భవనాన్ని స్వాధీనం చేసికొన్నాడట. అందులోని వస్తువులు ఎక్కడున్నాయో తెలియదు. ఒకప్పుడు ఆ ప్రాపంచిక సుఖాలే నా దృష్టిని ప్రక్కదారులు పట్టించేవి. గంటలకొద్ది వాటిని చూసుకొంటూ నా కష్టాలన్నిటినేకాక నన్ను నేనే మరచిపోయేవాడిని. నా బాధలు తీరిపోవడంతో ఆ ప్రాపంచిక సుఖాలమీద మోజు తీరిపోయింది. వాటిని తిరిగి పొందాలనికానీ, ప్రస్తుతం వాటి సొంతదారుల వద్దనుండి వాటిని తిరిగి

రాబట్టుకోవాలనికానీ నేను కోరుకోవడంలేదు. ఆ వస్తువులన్నిటికీ నేను తాత్కాలికంగా సంరక్షకుడిని మాత్రమేనని, నా దగ్గరఉండాల్సిన సమయం తీరిపోగానే అవి ఎవరిదగ్గరకి పోవాలో అక్కడికి పోయాయని భావిస్తున్నాను. నేను జైలునుండి బయటకి పోయాక నిద్రకుసరిపోయే ఆరడుగులజాగా, ఆకలి తీర్చడానికి వలసిన కొంత తిండితోపాటు కట్టుకోవడానికి సరిపోయే బట్టలు దొరికితే చాలు. ఒకప్పుడు నా బట్టల బీరువా యాభైకి పైగా రకరకాల దుస్తులతో నిండి ఉండేది. నేను ఈ కారాగారము చేరిన దినము, ఆ బీరువాలోఏబది సూట్లుండేవి ఈ రోజు గుడ్డపీలికలు దొరకడంకూడా కష్టమయిపోయింది. చేతికి ఏది దొరికితే దాని ఉపయోగాన్ని బట్టి భద్రపరచుకోవలసి వస్తూంది. ఎంతతేడానో గమనించండి.

నా భవిష్యత్తు గురించా? లేక నా పేరు ప్రతిష్ఠల గురించా? భార్యాపిల్లలు లేని యాభైమూడు ఏండ్లవానికి ఏ భవిష్యత్తూ, ఏం పేరుప్రతిష్ఠలు కావాలి? అందునాడబ్బు వెనుక వేసుకొని నలుగురిమీద ఆధిపత్యం చలాయించాలని కోరిక లేని నాకు పేరుప్రతిష్ఠలెందుకు? జీవితంలో ఎట్లాంటి ఒడుదుడుకులనెదుర్కొనే ధైర్యాన్ని నాకు మూడు సంవత్సరాల జైలుజీవితం అంద జేసింది. అందువల్ల తిండి, గుడ్డ, గూడులగురించిగానీ, నిరుద్యోగం గురించిగాని భయం నాకు ఏ కోశానాలేదు. నా గురించి బాగాతెలుసున్న వారెవ్వరూ నా మాటలపై అవిశ్వాసం చూపించరు. అంతేకాక నేను అబద్ధాలు చెప్పేటంత నీచ స్థితికి దిగుతానంటే నమ్మరు.

ఇకపోతే పుట్టపర్తికి నా తీర్థయాత్రలు. స్వామి యిచ్చిన యింటర్వ్యూలో "స్వామీ! బాంగ్‌కాక్ ఎప్పుడు వస్తారు?" అని అడిగాను. దానికి సమాధానంగా స్వామి "నీ వెంటనే నేనూ వస్తాను" అన్నారు. అవును అప్పటినుంచి నా వెంటగా జంటగా స్వామి ఉంటూనే వచ్చారు. చాలా రకాలుగా స్వామి సన్నిధిని నేను అనుభవిస్తూంటాను. నా మనస్సు క్రుంగిన క్షణాల్లో భగవానుని నామ సంకీర్తనం కావిస్తూ అంతరాంతరాల్లోంచి కొత్త ధైర్యము తెచ్చుకొంటుంటాను. నా హృదయాంతరాళంలో పీఠం వేసుకుని కూర్చున్నది స్వామియే కదా! ప్రశాంతినిలయంలో సంభాషణా భాగ్యసమయంలో మా సోదరుణ్ణి, నా పెంపుడు కుమార్తెనూ తన పాదపద్మాలకు ప్రణమిల్లనిచ్చారే కాని, స్వామి నాకా అవకాశం యివ్వలేదు. పాదనమస్కారం చేయడానికి ప్రయత్నించి నపుడల్లా 'తరువాత, తరువాత' అంటూ వారించే వారు. మొన్నీ మధ్య నాకు స్వప్నదృశ్యంలో ఆ అవకాశం కూడా కల్పించారు. తన గౌనును పాదాలు కన్పడేరీతిగా పట్టుకొని, "నీక్కావాల్సినంతసేపు నమస్కారం చేసుకో" అన్నారు. పుట్టపర్తి పోలేదే అని ఆశాభంగం పొందటం యింక అనవసరమే కదా! నా సాయిమాతనుంచి ఇంతపొందిన తర్వాత యింకా అడగడం లోభత్వమే కదా! "మిగిలిన పిల్లలు కూడా సాయిమాతనుంచి ఇవిపొందాలి. వారికి నేను అడ్డంకికాకూడదు" అని తెలుసుకొన్నాను.

నన్ను పోలీసులు అరెస్టు చేశారని విన్న నా స్నేహితులు తెలివితక్కువవ్యాఖ్యానం చేశారు. "సాయిబాబా ఆయన కెందుకు సాయపడలేదంటూ "కొందరు నా 'శ్రేయోభిలాషులు' అదే అర్థం వచ్చేట్లుగా మాట్లాడారు. వారందరికీ నా దొకటేసమాధానం. అదికూడా స్వామి చెప్పినదే. "నేను నీకు సమయం సందర్భం లేకుండా, అర్థరహితంగా బాధకల్పిస్తానా? బాధకు నా హృదయంలో చోటుకల్పించు. సంతోషానికెంత ఆరాట పడ్డావో అంత ఆరాటమే దుఃఖాని

క్కూడ చూపు. నేను ఏది నీకిచ్చినా నీ మంచికోసమే యిస్తానని దృఢనమ్మకం కలిగిఉండాలి. దానిని ఒక పరీక్షగా స్వీకరించు. దానినుంచి ప్రక్కకి తొలగి పోకు. అంతర్దృష్టి నభివృద్ధిగావించుకొని దానిద్వారా కష్టాలనూ, బాధలనూ తట్టుకొనేందుకు శక్తి పొంది తద్వారా లాభపడు'' అన్నారు స్వామి.

భగవాన్ బాబావారినుంచి సంకేతం రాగానే యీ ప్రదేశంనుంచి వెలుపలికి ఎట్టి ఒడుదుడుకులూ లేకుండా నడవడమే చేయవలసిన పని. ఈ మందిరంలో విడుదలసమయందాకా ఓపికతో నిరీక్షణమాత్రమే మిగిలినది. ఆ నిరీక్షణలో ''మనిషి ఈ ప్రపంచంలో చేసిన తప్పులకి బాధపడి తద్వారా బలవంతుడయి, జ్ఞానాన్ని ఆర్జించి అభివృద్ధి చేసుకోవాల"నే నిజాన్ని గుర్తించగలగాలి. అంతేకాక "బాబా! నన్ను కావాలంటే చంపు, లేదా రక్షించు. నేను తిర్గి తప్పుటడుగుఎన్నడూ వేయబోను" అనే దృఢనిర్ణయానిక్కూడా రావాలి. నాకు ఎప్పుడు కష్టాలెదురయినా "సాయిరాం'' అని పిలుస్తాను. అయితే స్వామి తనే బాధలను నాకు కలిగేట్లుచేస్తే అవి దైవానుగ్రహంగా స్వీకరిస్తాను. ఆ రకంగా ఈ వ్యక్తిని తన సాయిసైన్యంలో సిపాయిగా చేర్చుకునేదానికి శిక్షణ యిచ్చి విజయానికి దారిచూపుతున్నట్లు తలుస్తాను.

—సిరికుల్ చరుంగ్మతాంగ్
బాంగ్‌కాక్.

# గ్రామవాసులు-సంఘజీవనం

ప్రేమస్వరూపులారా!

పవిత్రమైన మానవజన్మ మనకు సంప్రాప్తించి నప్పటికిని తద్వారా మనము సార్థకము గావించుకొనే విధానాన్ని గుర్తించుకొనలేక పోవుచున్నాము. భారత దేశమునందు మనము అవతరించి ఆధ్యాత్మిక సంపత్తికి ఆలవాలమై అనేకవిధములైన అపోహలకు గురియై జీవిత సత్యాన్ని గుర్తించుకొన లేక అనేకమార్గములందు అలసటచెంది నిర్విరామ కృషిచే నిరంతరతాపత్రయములచే, అంతులేని ఆశలచే అరముకాని ఆవేశములచే అప్రాప్యములగు ప్రాప్తములకు ప్రాకులాడి అశాంతికి గురియగుసమయమునందు దిక్కులు చూపే చక్కని దీపికలు ఆధ్యాత్మిక జ్యోతులు అనే సత్యాన్ని గుర్తించుకొనలేకపోతున్నాము. నిజముగా మన భారతదేశమునందు ఆలయములు పవిత్రమైన జీవితమును అందించే మహాసోపానములు. ఇట్టి ఆలయాలు జన్మజన్మలనుంచి మనము ఆర్జించుకొన్న పుణ్యమును ప్రోగుచేసికొని ఈ పవిత్రమైన జన్మమును సార్థకము గావించుకోవటానికి తగిన ఉపాయమును, తగిన మార్గమును, తగిన సార్థకతను అందించేవి.

ఈ ఆటంబాంబుల కాలమునందు ఆలయాలు నిర్మించుకోవటము అత్యంత విచిత్రమైన సంఘటనలు.

ప్రేమస్వరూపులారా! మానవత్వము కేవలము కండరములచేత రక్తముచేత లేక ఎముకలచేత ఏర్పడినట్టిది మాత్రమే కాదని, దీనికి మనస్సు, బుద్ధి, ఆత్మ అనే సూక్ష్మశరీరముకూడ ఉన్నదని తెలిసికొని, దానిని సంతృప్తిపరచే నిమిత్తమై ఈ పాంచభౌతికమైన దేహాన్ని సార్థకమైన మార్గాల్లో ప్రవేశపెట్టడానికి ఎంతైనా మనము ముందంజవేయాలి. దివ్యాత్మస్వరూపులారా! ముఖ్యంగా మన జీవితము ఎన్నో విధములైన ఒడుదుడుకులతో ప్రయాణము సలుపుతూ ఉంటుంది. అనేకకష్టనష్టములకు, దుఃఖములకు గురియై విచారముల సహించి, భరించి ఈ ఆనందాన్ని వరించుకొనే దివ్యమైన మార్గాన్ని మనము ఈ నాడు చేపట్టాలి; అవలంబించాలి. నడవాలి. ఈ విధమైన అవకాశము మన జీవితములో దొరకుట చాలా దుర్లభము. మన జీవితము లోపల ఇలాంటి ఘడియలు చాలా అదృష్టవంతమైన ఘడియలు. ఇలాంటి ఘడియలను సార్థకం చేసికొన్నప్పుడే మన జీవితమున ఏ కష్టసమయమునందో ఏ దుఃఖసమయమునందో ఇలాంటి సంఘటనను మనము చింతించి తద్వారా మన జన్మమును సార్థకం చేసికోవటానికి అవకాశం ఉంటుంది. విజముగా నీతినిజాయితీలు ఇలాంటి పల్లెలయందే అంతో ఇంతో నిలచియున్నాయి.

ప్రేమ స్వరూపులారా! జీవితము అనేది కేవలము బయటనుంచి వచ్చినది కాదు. ఇది బ్రహ్మమునుండి ఆవిర్భవించినది. కేవలము జీవితమనేది ఆత్మనుంచి చేకూరినట్టిదేకాని, అన్నమునుంచి వచ్చేది కాదు. ఇలాంటి దివ్యమైన జీవితము ఎన్ని విధములైన పరిశోధనలకు లేక ప్రయత్నములకు, మనము గురియైనప్పటికిని అనేకములైన దుఃఖములకు కారకులమై పోతున్నాము. దీనికి కారణమేమిటి? కొమ్మ చెట్టునకు అంశమువలె జీవితముకూడ బ్రహ్మకు అంశముగా ఉంటుంది. కనుక ఇలాంటి అంశమైన బ్రహ్మాతత్త్వాన్ని పొందినప్పుడే నిత్య, శాంతినిలయమైన ప్రశాంతిని మనము అనుభవించటానికి అవకాశము ఉంటుంది. దివ్యమైన భవ్యమైన భారతదేశమునందు జన్మించి, ఈ విధమైన అవకాశానికి దూరము కావటము విజముగా మన దురదృష్టమే! ఈ పల్లెలే అన్యోన్యతకును, ఐకమత్యమునకును, సమరసమునకును, సంతోషమునకును కొంత ఆలవాలమైనవని మనము గుర్తించటం అత్యవసరము. ఏదో ఒకటి తిని, త్రాగి, నిద్రించి జీవితమును అంతము చేసికోవటము మానవుని కర్తవ్యము కానేరదు. "జంతూనాం నరజన్మ దుర్లభం". మానవజన్మ అతి ఉత్కృష్టమైనది; పవిత్రమైనది; సార్థకమైనది. ఇలాంటి జన్మ మనకు ప్రాప్తించి నప్పుడు సాధ్యమైనంతవరకు భగవచ్చింతనచేత, భగవత్ స్మరణముచేత, సత్సంగములచేత, పవిత్రమైన మార్గములచేత పరోపకారకమైన సేవలచేత జన్మమును సార్థకము గావించుకోవటానికి తగిన ఉపాయాన్ని ఎన్నుకోవాలి. విజముగా మానవత్వములో ఇలాంటి దివ్యత్వము ఉన్నది, అనే సత్యాన్ని కూడ ఈ నాడు మనము గుర్తించటానికి ప్రయత్నించాలి. దైవము సర్వభూతాంతరాత్మ. సర్వాంతర్యామి. సర్వభూతములయందున్నట్టి ఆత్మస్వరూపుడే దైవము. మీ దేహమే దేవాలయము. "దేహో దేవాలయ ప్రోక్తో జీవో దేవస్సనాతనః" ఈ సనాతనమైన ఆత్మ ఈ నూతనమైన దేహమును దేవాలయముగా చేసికొని ఈ జగత్తులో కొంతవరకు ఆదర్శమైన జీవితం అందించే నిమిత్తమై మానవత్వము మనకు ప్రాప్తించింది. ఈ మానవత్వాన్ని మనము సార్థకం చేసికోవటానికి ఏ కొంతకాలమునైనా సత్సంగములో గడపి పవిత్రమైన దైవానుగ్రహానికి పాత్రులు కావాలని ఈ నాడు ఒక నూతనమైన మార్గాన్ని అవలంబించాలి.

నిజముగా పల్లెలయందు అనేక కష్టనష్టములు, దుఃఖములు, అననుకూలములు మొదలైనవి ఉండ టము సహజము. అలాంటి అననుకూలములను మనము ఒకరికొకరు సమరసభావముచేత, అన్యోన్యముచేత, సోదరత్వముచేత, సంబంధబాంధవ్యములచేత పరిష్క రించుకొని కలసి మెలసి గ్రామాభివృద్ధికి, దేశాభివృ ద్ధికి అన్ని విధాల తోడు నీడగా ఉంటుంది మన జీవి తాన్ని సక్రమమైన మార్గములో ప్రవేశ పెట్టాలి. తెల్ల వారి కోడికూతతో లేచి, రాత్రి పరుండు నంతవరకును విశ్రాంత కృషిచేత మనము అనేకశ్రమలు పడుతు న్నాము. కాని తగిన శాంతిని మనము అందుకోలేక పోతున్నాము. తగిన సుఖాన్ని అందుకోలేక పోతు న్నాము. తగిన ఆనందాన్ని అందుకోలేక పోతు న్నాము. కారణమేమిటి? కేవలము భౌతికమునందే మన జీవితమును అంకితం గావించుకొంటున్నాము. దీనికి ఆధ్యాత్మికము, పారమార్థికము,అనేవి ఆధారంగా ఉన్నవనే సత్యాన్ని మనము నిరూపించాలి. తల్లి లేని బిడ్డఉండుటకు వీలుకాదు. చెట్టు లేని కొమ్మ నిలవటానికి వీలుకాదు. ఆ విధముగానే బ్రహ్మలేని మన బ్రతుకు నిలవటానికి వీలుకాదు. మనము చిన్మయమునుంచి పుట్టిన వారము, కాని మృణ్మయము నుంచి పుట్టిన వారము కాము. కనుకనే చిన్మయము చేరినప్పుడే మనము చిదానందమును చేరుకోవటానికి అవకాశం ఉంటుంది. కనుక ఆ చిన్మయమనేది ఏ బయట ప్రదేశమందునో, ఏ మార్కెట్టునందునో మనకు లభించేదికాదు. ఆ చిన్మయమనేది మన హృదయ స్థాయియందే ఉంటున్నది. ఆ చిన్మయతత్త్వమును మనము ఆరాధన చేసి తరువాత సేవలు చేసి సరియైన సత్ప్రవర్తనలచేత, సద్భావములచేత, సచ్చింతనల చేత, ఆవిర్భవింపచేసికొని తద్వారా మనము ఆ చిన్మ యత్వాన్ని అనుభవించటానికి కొంత అవకాశము చూచుకోవాలి. ఒక చిన్న ఉదాహరణము. మంచి విలువైన బంగారు కప్పు కలదు. అది నవరత్న ములతో పొదిగి వజ్రవైడూర్యమరకతమాణిక్యములతో చేరిన గిన్నె అయినప్పటికిని, అందులో ఒక్క చేపను విడిచి నప్పుడు, ఆ చేపకు ఏ మాత్రము ఆనందము ఉండదు — కారణమేమిటి? తన నివాసమైన తన స్వస్థానమైన జలమునే తాను ఆశిస్తుంది. ఆ జలము చిక్కినప్పుడే తనకు నిజమైన ఆనందము. ఆదేవిధముగనే మన జన్మ సార్థకము గావించుకోవ టానికి మన స్వస్థానమైన బ్రహ్మస్థానము, పవిత్రస్థా నము, దివ్యస్థానమును చేరినప్పుడే మనకు నిజమైన శాంతి లభిస్తుంది. కాని, ఏదో ధనకనకవస్తువాహనా దులచేత భోగభాగ్యములచేత, అధికారములచేత మనము ఆనందాన్ని అందుకోవాలనుకొంచే ఆ చిక్కే ఆనం దము నిత్యానందము కాదు; పరమానందము కాదు. ఇది కేవలము భౌతికమైన తాత్కాలికమైన క్షణభంగుర మైన ఆనందము. ఈ క్షణభంగురమైన ఆనందము నిమిత్తమై శాశ్వతమైన స్థానాన్ని, శాశ్వతమైన ఆనం దాన్ని కోల్పోవటము మానవునియొక్క కర్తవ్యము కానేరదు.

ప్రేమస్వరూపులారా! మనం అందరము ఇలాంటి సమావేశములలో చేరినందుకు సాధ్యమైనంత మేర తెల్లవారి లేచి రాత్రి నిద్రించునంతవరకు మన భౌతిక మైన కర్మలు ఎన్ని ఆచరించినప్పటికిని ఒక్క పది నిముషములైన భగవత్ చింతన చేసి సత్సంగములలో చేరి పవిత్రమైన సేవలు చేసికొని గ్రామాభివృద్ధికి తగిన అనుకూలస్థితిని మనకు మనమే తోడు నీడగా ఉండి కల్పించుకొని తద్వారా భౌతికంగాను, ఆధ్యాత్మికం గాను, కైవల్యంగాను శాంతిసంతోషములను అనుభ వించడానికి ప్రయత్నం చెయ్యాలి.

ఈ నాడు ఒక మందిరాన్ని నిర్మించుకొన్నాం.

ఒక గ్రామానికి మందిరం ఎందుకుండాలి? అంటే మన దేహానికి గుండె ఎంత ఆధారమో గ్రామానికి గుడి అంత ప్రధానము. గుండె లేని దేహము, గుడి లేని గ్రామము నిరుపయోగమైనవి. కనుకనే మన గ్రామమునకు ఒక నూతనమైన భవనాన్ని ఈ నాడు మనము నిర్మించుకొన్నాం. దానిలో నిత్యం సాయం కాలమైనప్పుడు అందరూ చేరి భగవన్నామస్మరణ చేయండి. మనము ఏ సేవలు చేయక పోయినా, ఏ దానధర్మాలు చేయకపోయినా, ఏ యజ్ఞయాగాది క్రతువులు ఆచరించకపోయినా, నామస్మరణచేసి తరిం చడానికి తగిన ప్రయత్నమును మీరు చేపట్టాలని నేను ఆశిస్తున్నాను. ప్రతిదానికి ప్రభుత్వంపైన ఆధార పడటంకాని, లేక అధికారులపైన ఆధారపడటంకాని, మానవుని కర్తవ్యం కానేరదు. మనకు రెండు కాళ్ళు కలవు. రెండు చేతులు కలవు. ఒక పొట్ట కలదు. ఒక పొట్టను నింపుకోవటానికి రెండు చేతుల ద్వారా మనము చక్కగా పనిచేస్తే మన పొట్ట నింపుకోవ డంలో ఎట్టి అభ్యంతరమూ ఉండదు. కనుక మనము ఈ నాడు పనికి దూరమైపోతున్నాము, మాటలకు దగ్గరైపోతున్నాము. మాటలచేత కార్యములను సాధించుకోలేము. మనము క్రియలను ఆచరించి కర్మమార్గములో ప్రవేశించి కర్మదీక్షను బూని త్యాగ జీవులుగా నిల్చి దేశమునకు గ్రామమునకు జీవితానికి గూడా ఒక సార్థకమైన దివ్యత్వాన్ని పొందవలెనని ఆశిస్తున్నాను. ముఖ్యంగా పల్లెలవారందరు ఐకమ త్యంగా ఉండవలెను. ఏ విధమైన భేదభావములున్న ప్పటికిని అందరియందున్నది ఒకే ఆత్మ. దివ్యమైన దైవత్వం ఒక్కటే అనే సత్యాన్ని మీరు గుర్తించు కొని ఎట్టి కోపములకు, ఎట్టి ఈర్ష్యలకు, ఎట్టి అసూ యలకు అవకాశమీయకుండా కక్షలను పెంచుకోకుండా ద్వేషములను పెంచుకోకుండా ప్రేమద్వారా, ప్రేమతో జీవించి, ప్రేమతో కార్యములను సాధించి ప్రేమతోనే ప్రేమస్వరూపుణ్ణి పొందడానికి తగిన ప్రయత్నం చెయ్యాలి. ఎందుకనగా భగవంతుడు ప్రేమస్వరూ పుడు. ప్రేమస్వరూపుడైన భగవంతుణ్ణి మనము ప్రేమ ద్వారానే పొందవలెనే తప్ప మరొక్క మార్గమున మనం పొందడానికి వీలు లేదు. చంద్రుణ్ణి చూడా లనుకొంటే మనము ఒక టార్చిలైటో, లేక హరికేన్ లాంతర్నో పెట్రోమాక్స్‌లైటో, ఎలెక్ట్రిక్‌బల్బో పెట్టి చూట్టానికి వీలు లేదు. చంద్రునియొక్క వెలుతురును ఆధారము చేసికొనే చంద్రుణ్ణి చూడవలసి ఉంటుంది. అదే విధంగా ప్రేమ ఆధారం చేతనే ప్రేమస్వరూ పుణ్ణి పొందడానికి మనకు చక్కని అవకాశము. సుల భమైన మార్గము. ఇటువంటి ప్రేమద్వారా మనలో ఉన్న కోపతాపములను, ఈర్ష్యాసూయలను, డంబము, అహంకారము ఇలాంటి దుర్గుణములను నామస్మర ణముచేత దూరము చేసి, సాధ్యమైనంతవరకు పవి త్రమైన జీవితంగా మార్చి అంతము చేరుకోవాలని నేను ఆశిస్తున్నాను.

ఒక చెట్టు పైన ఉండిన పక్షులను ఎగిరిపోయేటట్లు చేయాలంటే మనము ఏ విధమైనమార్గాన్ని అవలంబిస్తు న్నాము? చెట్టు క్రిందికి పోయి చప్పట్లు కొట్టినప్పుడే ఆ చెట్టుమీద ఉన్నపక్షులన్నీ ఎగిరిపోతున్నాయి. అరీతి గానే మన జీవితమనే వృక్షముపైన కామక్రోధ మోహలోభమదమాత్సర్యములనే పక్షులు చేరి ఈ జీవితాన్ని అనేక రీతులుగా మలిన పరుస్తుండే సమయ ములో ఈ చెట్టు క్రింద నిల్చుకొని రామా, కృష్ణా, గోవిందా అనే శబ్దం కనుక చేసినట్లయితే ఈ దుర్గుణము లనే పక్షులన్నీ ఎగిరిపోయి, పవిత్రమైన హృదయాన్ని కల్పింప చేసి, జీవితమార్గానికి ఆదర్శవంతమైన దివ్య ంగా వెలుగుతూ మన మార్గాన్ని నిరూపి స్తుంది. కనుక, మీరు నేటి నుంచి భగవత్సమాజముల

స్థాపించుకొని రోజంతా మనం కష్టపడి శ్రమించి పని చేసినప్పటికిని, సాయంకాలంలో ఒక చోట చేరి, రామా, కృష్ణా, గోవిందా, నారాయణా అనే నామ స్మరణచేత మన ప్రాచీన సంప్రదాయాన్నీ, పవిత్రమైన భారతీయసంస్కృతినీ తిరిగి మీరు పునరుద్ధరింప చేసిన వారవుతారు. పల్లెలే దీనికి ప్రధానమైన పట్టుకొమ్మ లనే సత్యాన్ని మీరు గుర్తించి వర్తించిన వారవుతారని నేను ఆశిస్తూ, ఆశీర్వదిస్తూ నా ప్రసంగాన్ని ముగిస్తున్నాను. ముఖ్యంగా మీరందరుకూడా నూతనమైన పద్ధతిని ఈ నాటినుంచి ఆరంభించి మన గ్రామానికి కావలసిన సదుపాయములను అందరూ కలిసి చేసి కొనవలెను. ఒకరికొకరు కలిసి మెలిసి పని చేసినప్పుడు ఎతంటి ఘనకార్యాన్నయినా సాధించటానికి అవకాశంగా ఉంటుంది. కనుక, దైవము తన ఆశీర్వాదములను దండిగా నిండుగా లభింపచేసి వెంట, జంట, ఇంట, కంట, తోడుగా ఉండి మీకు తగురీతిగా సహాయ పడుచూ ప్రోత్సాహ ఉత్సాహాల్ని అందిస్తాడని నేను ఆశిస్తూ నా ప్రసంగాన్ని విరమిస్తున్నాను.

—శ్రీవారి దివ్యోపన్యాసము,
30-3-79, నాగర్ కర్నూల్.

## శాంతిసౌఖ్యదాయి సత్యసాయి

1. నరులలోన నున్న—నారాయణత్వమ్ము
కనుల యెదుట మనకు—కానిపింప
క్షీరజలధి వీడి—చేర వచ్చిన స్వామి
శాంతి సౌఖ్యదాయి—సత్యసాయి.

2. ప్రకృతిలోన నెపుడు—పరికింపగా రాని
మహిమ లెన్నొ చూపు—మధురమూర్తి
ప్రక్క విలిచి మనల—పాలింపగా వచ్చె
శాంతి సౌఖ్యదాయి—సత్యసాయి.

3. నామజపముచేత—ప్రేమభావముచేత
సంఘసేవచేత— సంతసించు
భక్తవరుల పాలి—ప్రత్యక్ష దైవమ్ము
శాంతి సౌఖ్యదాయి—సత్యసాయి.

4. మనము రెండడుగులు—తనవైపువేయగా
పది యడుగులు తాను—కదలి వచ్చు
అవధు లెరుగనట్టి—అనురాగమూర్తిరా
శాంతి సౌఖ్యదాయి—సత్యసాయి.

5. దర్శనమ్ము నొసగి—ధన్యతచేకూర్చు
స్పర్శనమున దివ్య—శాంతికూర్చు
మలిన కర్మ బాపు—మధురభాషణముచే
శాంతి సౌఖ్యదాయి—సత్యసాయి.

6. పరమగురులు కలరు—పడవ తీరము చేర్ప
బోధకులును గలరు—బాధ తీర్ప
గురుల కెల్ల గురువు—గురియైన పరమాత్మ
శాంతి సౌఖ్యదాయి—సత్యసాయి.

7. ఆత్మ లేదటంచు—అర్చనల్ వలదంచు
దైవ మన్న వట్టి—భావ మనుచు
పలుకు నాస్తికులకు—ప్రాణగొడ్డంబురా
శాంతి సౌఖ్యదాయి—సత్యసాయి.

8. చదువు లెల్ల చదివి—సత్యంబు గనలేని
అంధపండితులకు—నంజనంబు
మొదలి చదువులకును—మూలకందము తాను
శాంతి సౌఖ్యదాయి—సత్యసాయి.

9. దిక్కు తెలియనీని—దీర్ఘ రోగము నైన
చిటికలో కుదిర్చి—నేద తేర్చు
ఆర్తజనుల పాలి—అద్భుత వైద్యుడు
శాంతి సౌఖ్యదాయి—సత్యసాయి.

10. హస్త చాలనమున—నభిమత వస్తువుల్
సృష్టిచేసి యిచ్చి—తుష్టిగూర్చు
లాలనముల నేలు—లీలావినోదిరా
శాంతి సౌఖ్యదాయి—సత్యసాయి.

—టి. భాస్కరరావు,
గుంటూరు.



# నలుగురు సోదరులు

ప్రేమస్వరూపులారా! నాలుగు వేదములు దశరథ మహారాజు ఇంటియందు నాలుగు రూపములు ధరించి ఆడుకొను చున్నవి. ధర్మమునే ప్రత్యక్షస్వరూపముగా నిరూపించుచూ, ఆచరించే యజుర్వేదమే రామ స్వరూపాన్ని ధరించింది. కనుకనే "రామోవిగ్రహవాన్ ధర్మః" అని వాల్మీకి వర్ణించాడు. యజుర్వేదము ధర్మసంస్థాపననిమిత్తము, ధర్మాచరణ ధర్మబోధనిమిత్తమై ఏర్పడిన వేదం. రామచంద్రుని నామమును నిరంతరము స్మరించుచూ, జపించుచూ, ఉండటమే యజ్ఞముగా భావించి, దాని తత్త్వమును నిరంతరము వల్లెవేయించే మంత్రస్వరూపమైన ఋగ్వేదమే లక్ష్మణుడుగా జన్మించాడు. మంత్రస్వరూపమైనది ఋగ్వేదము. సర్వమంత్రముల సారము రామనామము. కనుకనే రామనామమును స్మరించుచూ తరింపచేసే మార్గమును లోకమునకు బోధించే నిమిత్తమై లక్ష్మణుడు ఋగ్వేదస్వరూపుడై అవతరించాడు. స్మరణచేత తరింపచేయుటకై లక్ష్మణుడు మార్గదర్శకుడిగా నిలిచి నప్పటికినీ, గానముచేత లోకముయొక్క హృదయాన్ని హరించి, వరించి, తరించి, భ్రమింపచేసే నిమిత్తమై భరతుడు సామవేదస్వరూపుడై అవతరించాడు. రామనామమును నిరంతరము గానము చేయుచూ, తన హృదయములో తపింపచేసే తత్త్వమును, హరింపచేయించుకునే నిమిత్తమై భరతుడు సామవేదస్వరూపుడై అవతరించాడు. సర్వభావములు, సర్వరాగములు, సమస్త గీతలు ఈ సామవేదమునుండియే అవతరించినవి. ఈ ఋగ్వేద, యజుర్వేద, సామవేదతత్త్వముల ఆజ్ఞానుసారంగా ప్రవర్తించుచూ, అంతర్బహిశ్శత్రులను అరికట్టే తత్త్వ

స్వరూపుడై అవతరించాడు శత్రుఘ్నుడు, అధర్వణ వేదస్వరూపుడై. ధర్మస్వరూపుడైన రాముడు యజుర్వేదంగానూ, లక్ష్మణుడు ఋగ్వేదంగానూ. భరతుడు సామవేదముగనూ, అంతర్బహిశ్శక్తులను అణగద్రొక్కి, అజ్ఞను శిరసావహించి, ఆత్మను అనుసరించే మార్గమును అవలంబించిన శత్రుఘ్నుడు అధర్వణ వేదంగానూ జన్మించారు. ఈ చతుర్వేద స్వరూపులు లోకోద్ధరణనిమిత్తమై, ధర్మస్థాపన నిమిత్తమై ఆదర్శములను నిరూపణ చేస్తూవచ్చారు.

రాముడు అవతారపురుషుడనియు, సాక్షాత్‌నారాయణమూర్తియనియు, దైవస్వరూపుడనియు కేవలము మనము విశ్వసిస్తున్నాముకానీ, అతను ఆదర్శమూర్తి అయిన మానవస్వరూపుడనే దాన్ని మనం విశ్వసించలేక పోతున్నాము. ఆదర్శపురుషుడనే తత్త్వాన్నే మనము విశ్వసించ లేని బలహీనులము అవతారతత్త్వాన్ని ఏ విధంగా విశ్వసించగలము? మానవస్వరూపాన్ని ధరించి, మానవ సంఘములో, సమాజములో, జీవించుచూ, ఆదర్శవంతమైన నిత్యజీవితాన్ని అనుభవింప చేసిన రామచంద్రమూర్తిని ఆదర్శమూర్తిగా విశ్వసించలేనటువంటి నేటి మానవుడు రామున్ని అవతారమూర్తిగా పూజించడం ఇది కేవలం హాస్యాస్పదము. నిత్యజీవితములో ఆదర్శాన్ని అందించే మూర్తిగా మనం విశ్వసించినప్పుడే, అవతారమూర్తిగా విశ్వసించడంలో అర్థముంటుంది. రామాయణము పూర్తిగా మానవాదర్శవంతమైన త్రిమూర్తిస్వరూపకంగా నిరూపణ చేసినది. నిర్గుణనిరాకారబ్రహ్మస్వరూపుడైన ఆత్మతత్త్వము, నరాకారాన్ని ధరించినప్పుడు ఆదర్శవంతమైన జీవితమే మనకు అత్యవసరమైనది.

శబ్దస్వరూపమైన ప్రణవమునందు అకార, ఉకార మకారశబ్దములచే ఏర్పడినదే ఓంకారమనే తత్త్వము. అకారము లక్ష్మణుడనియు ఉకారము భరతుడనియూ, మకారము శత్రుఘ్నుడనియూ, ఈ మూడింటియొక్క చేరికనే ఓంకారమనే రామునిగా నిరూపిస్తూ వచ్చింది. అనగా త్రిమూర్త్యాత్మకస్వరూపం రామచంద్రమూర్తి.

లోకములో ఎంతటి బలవంతుడైననూ, విద్యావంతుడైననూ, శ్రీమంతుడైననూ, కొన్ని అవాంతరములు సంభవించినప్పుడు మానవుడు బలహీనుడై దుర్గతులకు గురి అవుతుంటాడు. ప్రతికూలములు సంభవించినప్పుడు మానవుడు బలహీనుడు కావడము, లేక క్రుంగికృశించిపోవడము ఇది సామాన్యమైన లక్షణము. కానీ అట్టి అవాంతరములు ప్రారంభమైనప్పుడు, ధైర్యసాహసములచేత ఎదుర్కొని, దానిని సాధించి, అనేక విధముల ఆదర్శాన్ని అందించిన మూర్తి రామచంద్రమూర్తి. ప్రతిమానవుని జీవితమునందు కష్టములు లేక సుఖము లభించుట కల్ల. సుఖములను చూచి కష్టములు వెక్కిరిస్తుంటాయి. ఆనందమును చూచి దుఃఖములు పరిహసిస్తుంటాయి. ఈ ఆనందసంతోషములకై ఈ దుఃఖవిచారములు కాచుకొని ఉంటుంటాయి. మనసు ఎత్తుపల్లములతో చేరినది. మన పరిస్థితులు కూడనూ, ఎత్తు పల్లములతో కూడినవి. ఇలాంటి పరిస్థితులయందు మానవ జీవితము ఎత్తుపల్లములనే సుఖదుఃఖములు లేకుండా జీవించడానికి ఏవిధముగా వీలవుతుంది? నిజముగా 'నసుఖాల్లభతేసుఖం' అన్నట్లుగా కష్టము లేకుండా సుఖం అనుభవించడం వీలు కానటువంటిది? సుఖము, దుఃఖము అనేవి ప్రత్యక్షమైన స్వరూపములు కావనే సత్యాన్ని ఈ నాడు మనం గుర్తించాలి.

"కష్టసుఖములు రెండును కలసి యుండు
కష్టమును విడదీయ శక్యమ్ము కాదు.
సుఖము ప్రత్యేకముగ నెందుచూడబోము.
కష్టము ఫలించెనేని సుఖమని యంద్రు."

కనుక మనము ఈ నాడు భౌతికసుఖమే సుఖమని భావిస్తూ, ప్రతిబంధకములు ఏర్పడినప్పుడు కష్టమని దుఃఖిస్తూ ఉండుట మానవత్వములో ఒక వికార దృశ్యము; విరుద్ధ మార్గము. ఇది కేవలము లీలా విభూతియొక్క తత్త్వము. లీలావిభూతి యనేది తాత్కాలికమైనది. క్షణభంగురమైనది. సుఖమునకు పొంగడం, దుఃఖమునకు క్రుంగడం మానవుని సహజ గుణము కానేరదు. రెండింటియందు సమత్వ మును అనుభవించేస్థితిని అందుకునే శక్తిసామర్థ్య ములు కలిగి యుండవలెను. అసంపూర్ణమైన తత్త్వాన్ని త్యాగం చేసి, పూర్ణత్వమనేదాన్ని నిత్య విభూతిని అనుభవించుకోవడానికి తగిన కృషి చేయాలి. ఇట్టి సమత్వమును, ఇట్టి ఏకత్వమును, ఇట్టి పవిత్ర తను, ఆదర్శవంతముగా లోకానికి అందిస్తూవచ్చాడు రామచంద్రమూర్తి.

ప్రతిజీవితమునకూ, ప్రతిగృహమునకూ, ప్రతి కుటుంబమునకూ, ఒక ఆదర్శాన్ని అందించాడు రామచంద్రుడు. తండ్రికొమరులు, భార్యాభర్తలు, అన్నదమ్ములు ఏవిధంగా ఉండాలి అనే జీవితాన్ని కుటుంబస్వరూపుడైన రామచంద్రుడు లోకానికి ఆద ర్శంగా అందిస్తూవచ్చాడు. జలమునందు కమలము పుడుతుంది, జలగ పుడుతుంది. కమలమునకు, కప్పకు, జలగకు జన్మస్థానము జలమే. కానీ, కమ లము మానవుని హృదయమును వికసింపచేస్తుంది. హృదయానందాన్ని అందిస్తుంది. జలగ మానవుని హింసిస్తుంది. జన్మస్థానము ఒకటైనప్పటికినీ, ఈ కర్మభేదములు అనేకంగా ఉంటున్నాయి. అమృ తము హాలాహలము సముద్రమునందే ఆవిర్భవించి నవి. కానీ, విషము మానవుని నాశనము చేస్తుంది. అమృతము మానవుని ఉద్ధారపరుస్తుంది. కనుకనే జన్మస్థానములు ఒకటైనప్పటికినీ, కర్మభేదములు భిన్న ముగా ఉండటంచేత అవస్థాత్రయములు అవస్థాభేద ములు అనేకంగా మనకు నిరూపిస్తూ వస్తుంటాయి. ఒక తండ్రికి ఇరువురు కుమారులు పుట్టినప్పుడు, ఒకడు మంచివాడుగనూ, ఒకడు చెడ్డవాడుగనూ రూపొందు తుంటాడు. ఒకడు కీర్తిని, మరొకడు అపకీర్తిని అందిస్తూంటాడు. ఇవి కేవలము జన్మాంతర కర్మ ముల ప్రతిఫలములే, తప్ప వ్యక్తిస్థానములు కావు. అదేవిధముగనే రామచంద్రమూర్తి అవతారమూర్తిగా అవతరించి, మానవుడియందున్న భిన్నత్వాన్ని, భేద మును రూపుమాపి ఏకత్వమనే నిత్యవిభూతితత్త్వాన్ని అందించడానికై ఆదర్శమూర్తిగా మెలిగాడు.

'రామ' అనే నామము కేవలము రుచినిమిత్తమై, లేక తల్లిదండ్రుల ప్రీతినిమిత్తమై, లేక లోకనిమి త్తమై పెట్టిన పేరు కాదు. వరించే హృదయమునకు రమింపజేసే హృదయమునకే 'రామ' అని పేరు. కనుక ఈ నామమనేది ఎక్కడ మనకు ఆవిర్భవించి నది? ఈ నాలుగువేదములు ఎవరియందు ఆవిర్భవించి నవి? దశరథుని పుత్రులుగా అవతరిస్తూ వచ్చాయి. దశరథుడనగా ఎవరు? కేవలము ఒక మహాచక్ర చక్రవర్తిగా ఉండి అయోధ్యాపురమును ఏలినటువంటి ఒక రాజుగా భావించరాదు. దశరథుడనగా ఈ దేహమే. ఐదు కర్మేంద్రియములు, ఐదు జ్ఞానేం ద్రియములతో కూడిన రథముకనుక దేహమునకు దశ రథము అని పేరు. ఇతడు అయోధ్యను పాలిస్తున్నా డన్న మాట. 'అయోధ్య' అనగా యోధులు చేరడానికి వీలుకాని స్థానము. లోకసంబంధమైన శత్రువులు మన దేహమునకు మాత్రమే సంబంధపడిఉంటారు గానీ హృదయానికి ఏమాత్రమూ సంబంధపడిఉం డరు. దేహాన్ని జయించవచ్చునుగానీ, హృద యాన్ని జయించడం శత్రువులకు సాధ్యంకాదు. కనుక ఎట్టి శత్రువులు కూడ, ఇందులో ప్రవేశించ

డానికి వీలుకాని రాజ్యము. అదే హృదయసామ్రాజ్యము. అదే అయోధ్య.

దీనికి మూడు ద్వారములు ఉంటున్నాయి. అవే సత్వరజస్తమోగుణములు. ఈ మూడు గుణములతో చేరి, దశేంద్రియములతోకూడి హృదయమనే రాజ్యమును పాలించే దశరథునికి నలుగురు కొమరులు పుట్టారు. ఆ నలుగురు ధర్మ, అర్థ, కామ, మోక్ష స్వరూపులు. ఈ చతుర్విధపురుషార్థములందు ధర్మము మొట్టమొదటిది. అదియే రామచంద్రుడు. ఇంక రామచంద్రుని అనుసరించిన సోదరులు; అర్థకామ మోక్షములు. ఈ విధముగా అనుసరించినప్పుడే మానవుని జీవితము ధన్యమౌతుంది. కనుక, ఈ నలుగురు అన్నదమ్ములు రెండుగా విభజింపబడుతూ వచ్చారు. భరతశత్రుఘ్నులు ఒకవైపునా, రామలక్ష్మణులు మరొకవైపునా చేరిపోయారు. ధర్మ అర్థములు రెండూ ఒకటైపోయినవి. కామమోక్షములు రెండూ ఒకటైపోయినవి, ధర్మమును అనుసరించినదే అర్థము; మోక్షమును కామించిన వాడే శత్రుఘ్నుడు. కానీ ఈ నాడు కలియుగ ప్రభావము చేత మానవుడు ధర్మ, అర్థ, కామ, మోక్షమనే నాలుగు మార్గములయందు ధర్మమును త్రుంచివేస్తున్నాడు; మోక్షమును నిరసిస్తున్నాడు. అర్థకామములలో పడి అల్లాడి పోతున్నాడు. మోక్షమక్కరలేదు. ధర్మములో జొరబడనక్కరలేదు. అర్థకామములు రెండూ ఉంటే చాలు. ఇది కేవలము రాక్షస సంబంధమైన గుణము. ఇది కేవలము మానవ ఆకారము ధరించిన రాక్షసత్వమనే చెప్పవచ్చు. కనుకనే ఇట్టి అపవిత్రమైన మార్గమును అవలంబింప చేసికొనకుండేనిమిత్తమై, రాముడు తన ధర్మస్వరూపాన్ని నిరూపిస్తూ, తమ అన్నదమ్ములయొక్క ప్రవర్తనను చక్కగా లోకానికి అందిస్తూ వచ్చాడు.

రాముని తత్త్వము గుర్తించడానికి వీలుకానిది. అతని లోతుపాతులు ఏమాత్రమూ తెలిసికోవడానికి వీలుకాదు. కనుకనే 'యతో వాచో నివర్తంతే అప్రాప్య మనసా సహ' అన్నారు. మనసునకు కానీ, వాక్కునకు కానీ అలవికాని తత్త్వముతో కూడిన వాడు రాముడు. ఇలాంటి రామచంద్రమూర్తి అరణ్యవాసము పోవలసి వచ్చింది. ఎంతమంది వలదన్నప్పటికినీ, లక్ష్మణుడు రామచంద్రుని అనుసరిస్తూ వెళ్ళాడు. కన్న తల్లిదండ్రులను వదిలాడు. కట్టుకున్న భార్యనుకూడ, వదిలాడు. తనయొక్క లోక సంబంధమైన భోగములను త్యజించాడు. రాముడే నాకు ప్రధానము అనే లక్ష్యాన్ని పెట్టుకుని ప్రయాణం చేశాడు. ఈ విధముగా సీతారాములను అనుసరిస్తూ, వారికి కింకరుడుగా సేవలు సలుపుతూ తన జీవితమును ధన్యము గావించుకునే లక్ష్యమే పరమగమ్యమని భావిస్తూవచ్చాడు. రావణునితో యుద్ధముచేసే సమయమునందు లక్ష్మణుడు ఈ రామునకు కుడిభుజముగా నిలచి అనేకావస్థలకు గురి అయ్యాడు. కష్టములను హృదయపూర్వకముగా స్వాగతం చేసుకున్నాడు. నవ్వుతూ, నవ్వుతూ కష్టములను అనుభవించుతూవచ్చాడు. ఒకానొక సమయమునందు సీతాన్వేషణ సలుపుతూ వెళ్ళే సమయములో కబంధుని చేతిలో ఇరువురూ చిక్కుకున్నారు. అప్పుడు లక్ష్మణుడు చెప్పుతున్నాడు; "అన్నా! నా విషయమై నీవు ఏమాత్రము విచారించనక్కరలేదు. నన్ను ఈ కబంధునకు ఆహారముగా అప్పజెప్పి తమరు క్షేమముగా ఉండండి" అని ప్రార్థించాడు. సోదరుని నిమిత్తమై ప్రాణమునుకూడా త్యాగము చేయడానికి సంసిద్ధుడైన వాడు లక్ష్మణుడు. కనుకనే ఒకానొక సమయములో యుద్ధభూమిలో లక్ష్మణుడు మూర్ఛిల్లగా, రాముడు లోకరీతిగా ఆదర్శాన్ని అందించే నిమిత్తమై, పరిత

పించినట్లుగా కొంతనటన చేస్తూవచ్చాడు. వెదకిన సీత వంటి భార్య లోకమందు చిక్కవచ్చును. కానీ, లక్ష్మణునివంటి తమ్ముడు నాకింక చిక్కడని విచారించాడు. కనుక లక్ష్మణుడు ఎంత ప్రీతిగా ఆ రాముని అనుసరిస్తూ వచ్చాడో, రాముడుకూడా, లక్ష్మణుని అంత ప్రీతిగా ప్రాణసమానంగా ప్రేమిస్తూవచ్చాడు. సోదరప్రేమతత్త్వము, అన్యోన్యత, వారి అనుచరణను ఎంతైనా లోకాదర్శముగా అందించుచున్నవి; ఇది ప్రధానఘట్టము.

ఇంక భరతశత్రుఘ్నులు తాతగ్రామములో ఉండినప్పుడు తండ్రి మరణవార్త విన్నంత మాత్రముననే అయోధ్యకు ప్రయాణమై వచ్చారు. అయోధ్యను చేరిన వెంటనే వసిష్ఠులవారివల్ల రామచంద్రున్ని 14సంవత్సరములు అరణ్యమునకు పంపిన విషయము తెలిసికున్నారు. తండ్రి అంత్యక్రియలుచేసి తమ పరివారముతో అరణ్యానికి ప్రయాణమై వెళ్ళారు భరతశత్రుఘ్నాదులు. భరతుడు అరణ్యములో రామలక్ష్మణులను అనేకవిధములుగా ప్రార్థించి అయోధ్యకు రావలెనని ఎంతగానో వేడుకొన్నాడు. కానీ పితృవాక్యపరిపాలన నీకునూ, నాకునూ ప్రధానమైన ప్రమాణమని రాముడు బోధిస్తూవచ్చాడు. అయోధ్యారాజ్యమును పరిపాలించే అధికారము నీకు మాత్రమే ఉన్నది. కానీ, ఈ దుష్టునికే మాత్రమూ లేదని పాదములు పట్టి ప్రార్థించాడు భరతుడు. "తమ్ముడా! తండ్రి ఇచ్చినటువంటి రాజ్యమును నేను పరిపాలన చేస్తాను. తండ్రి నీకందించిన రాజ్యమును నీవు పరిపాలన చేయాలి. ఇది ఇరువురి కర్తవ్యమని రాముడు నిరూపించాడు. కేవలము అయోధ్యారాజ్యమును భరతునకు మాత్రమే ఇచ్చినాడు. కానీ ఏ రాజ్యమునూ, రామునకు అందించలేదు. అయోమయస్థితిలో మునిగాడు భరతుడు. "అరణ్యరాజ్యమును నాకందించాడు. ఈ అరణ్యములో ఋషులు, తాపసులు అనేకవిధములుగా బాధలుపడుచూ, రాక్షసకృత్యములచేత హింసలు పడుతుండటంచేత ఈ రాక్షసకృత్యములను హతమార్చి ఋషులను పోషించే రాజ్యమును నాకందించాడ"ని రాముడు చెప్పాడు. ఇక్కడ భరతుడు అనేకవిధములుగా రాముని వేడుకుంటూ ఉండగా, వసిష్ఠులవారు ప్రవేశించి "భరతా! సోదరుని మనస్సును బాధించడము మంచిది కాదనే విషయం నీకు తెలియదా" అన్నాడు. కేవలము నీవు 'సోదరుడు సోదరుడ'ని ప్రేమిస్తున్నావేకానీ, నీయొక్క వాంఛచేత రాముని హృదయము ఎంత బాధపడుచున్నదో నీవు గుర్తించడం లేదు." కనుక అతని మనస్సును ఎవ్వరుకూడ, మార్చుటకు వీలుకాదు. ఏకవాక్యమే శ్రీరామచంద్రుని వాక్యము. అట్లయిన ఈ 14 సంవత్సరములు నేను, శత్రుఘ్నుడు అరణ్యములో ఉండగలము. నీవు లక్ష్మణసమేతుడవై సీతాదేవితోబాటు అయోధ్యకు పోవచ్చును కదా! ఈ ప్రతిజ్ఞ దశరథమహారాజు మనకు ఇచ్చినది. దీనియందు నీకు ఎంత హక్కు గలదో నాకును అంత హక్కు గలదు. కనుక ఈ అరణ్యమును నేను పరిపాలిస్తాను, నీవు అయోధ్యకు వెళ్ళుమని కూడ మరీ ప్రార్థించాడు భరతుడు. అనగా సోదరులయొక్క ప్రేమతత్త్వము ఈ నలుగురియందునూ ఎంత సమత్వముగా ఉన్నదనే సత్యాన్ని మనం చక్కగా గుర్తించాలి. ఈ నాటి సోదరులు ఏదో ఒక నెపముతో మనకు రాజ్యము చిక్కితే చాలని చెప్పి, అర్హతలేని అధికారమునకుకూడ ఆశలు చాస్తూ అరుస్తుంటారు. కానీ, తనకు ఆ రాజ్యమును రామచంద్రమూర్తి అందించినప్పటికినీ, ఆ రాజ్యమును తాను ఏమాత్రమూ చేపట్టడానికి శ్రమించలేదు భరతుడు. సంకుచిత చిత్తులైన స్వార్థపరులైన సోదరులు ఈ నాడు అధికమవుతూ వచ్చారు వారి హృదయములు ఏ మాత్రముకూడనూ విశాలమైనవి కాలేకపోతున్నాయి. నిరంతరము రామాయ

ణమును చదువుతుంటాము. అనేకవిధములుగా నామస్మరణ చేస్తుంటాము. భజనలు సలుపుతుంటాము. జపధ్యానములు చేస్తుంటాము. కానీ దైవత్వాన్ని మనం ఏం గుర్తించుకున్నాము? సామాన్యమైన సంబంధబాంధవ్యాన్ని గుర్తించుకోలేని రాక్షస కృత్యములతో చేరిన మానవులము ఇక దైవత్వాన్ని ఏవిధంగా గుర్తించగలము? ఒక్క గర్భములో పుట్టిన సోదరులము అన్న భావముకూడనూ వారిలో లేనప్పుడు ఇంక దైవాంశము ఏరీతిగా భావించగలరు? తండ్రి యాజ్ఞను శిరసావహించడము, పితృవాక్యపరిపాలనే నాకు ప్రధానమైన లక్ష్యమని బోధించడము రాముని యొక్క ఆదర్శము. రామనామం వేదసారం; క్షీర సాగరము. ఇలాంటి పవిత్రమైన రామతత్త్వాన్ని తెలిపికోవడంలో మానవత్వంలో ఉన్న ఆదర్శాన్ని గట్టిగా మనము నిరూపించాలి. మానవత్వముతో అనుభవించలేని రామతత్త్వాన్ని మనము ఇక ఏ సాధనచేత సాధించగలము.

—భగవానుని దివ్యోపన్యాసము, శ్రీరామనవమి,
బృందావనము. 25-3-80.

# విజ్ఞానశాస్త్రం, మతం, ఆధ్యాత్మికం.

గత కొద్దిసంవత్సరాలుగా మూఢవిశ్వాసాలమీద వాగ్వివాదాలు జరపడం పరిపాటయిపోయింది. అంతే కాకుండా కొందరు అధికార్లు సామాన్యజనంలో హేతువాదాన్ని, వైజ్ఞానికదృక్పథాన్ని పెంపొందింప జేయాలని వాదిస్తున్నారు. ఇది సరిపోదన్నట్లు కొన్ని మతాల మీదా, వాటి బోధకులమీదా దుష్ప్రచారం గావిస్తున్నారు. కొందరు మతమంటే మత్తుమందనీ కనుక వర్జనీయమనీ చాటుతున్నారు. ఇట్లాంటి వారికి హేతువాదంగురించి ప్రచారం చేయడానికిగల హక్కునెవరూ కాదన జాలరు, అయితే సామాన్యజనావళిమానసికశాంతికోసం, ఆనందంకోసం ఆయామతవిశ్వాసాలను, ఆచారాలను పాటించడానికి గల హక్కును కాదనడాన్కి వారికి హక్కులేదని మాత్రంచెప్పాలి. మతాన్ని మతవిశ్వాసాలను, ఆధ్యాత్మికాన్నీ వర్జిస్తే ప్రపంచం అంతా పిచ్చివాళ్లతోనూ, మతిహీనులతోనూ నిండిపోతుంది. నేరాలసంఖ్య పెరిగి పోతుంది. శాస్త్రవేత్తలూ, అధ్యాపకులు ఆధ్యాత్మికజిజ్ఞాసను ప్రజల్లో పెంపొందించడానికి ఒకఉద్యమం లేవదీయాలి. అవసరమయిన ప్రచారప్రబోధలు చేసి తద్వారా దేశంలో క్రమశిక్షణకోసం కృషిచేయాలి.

నిజమయిన శాస్త్రజ్ఞుడు సత్యాన్వేషణనే లక్ష్యంగా పెట్టుకొని తనపరిశోధనలు సాగిస్తాడు. వ్యక్తిగతమయిన ఇష్టానిష్టాలకి చోటులేనిది సత్యాన్వేషణ. విజ్ఞానశాస్త్రం అధ్యయనం చేసినవాడు సత్యాన్ని ఎదుర్కొనడానికి జంకక, విలువలకు ప్రాధాన్యం ఇస్తాడు. సత్యాన్ని సాధించడంలో ఒక్కోసారి అపజయం ఎదురయినా దిగులు చెందడు. కడచిన శతాబ్దాల్లో సత్యాన్ని మానవుడు వివిధరంగాల్లో బలంతో సాధించినట్లు చరిత్ర తెలియ

జేస్తోంది. అయితే ఇది నిజం కాదు. ఈ వ్యాఖ్యానం చరిత్రకారుల దోషంవల్ల కల్గినది. స్టీన్‌అనే ఆయన ప్రతిపాదించిన సిద్ధాంతం (Symbolic logic definition of truth) ఆధారంగా నిరూపించనవసరం లేని వాటి లక్షణమే సత్యం అనిచెప్పవచ్చు. సగోచరమైన వాటిద్వారాకానీ, అంతరార్థం ప్రాతిపదికగా గానీ, సిద్ధాంతాలు రూపొందించుకోవడమే వైజ్ఞానికపద్ధతి (Scientific method)కి మూలం ఆధారాల ద్వారా నిరూపించగల్గినపుడే సిద్ధాంతాలు నిలబడగల్గుతాయి. ప్రస్తుతం విజ్ఞానశాస్త్రం ఎట్లాధారభూతమయిన సిద్ధాంతాలతో నిండియున్నది? అందువల్ల విజ్ఞానశాస్త్రపు పరిధి పరిమితమనే సత్యాన్ని గుర్తించాలి. అయితే అదే పరిమితిపరిధి గల విజ్ఞానశాస్త్రంద్వారా ఋజువు చేయడానికిగాని వివరించడానికిగాని అసాధ్యమైన విషయాలను, సంఘటనలనూ నిర్లక్ష్యం చేయటం నమ్మకపోవటం మూర్ఖత్వానికి దారితీస్తుంది. పురోగమిస్తున్న విజ్ఞానంతోపాటు ఆయా సిద్ధాంతాలను మార్చుకోకపోతే, ఆ సిద్ధాంతాలు అంతంలో తప్పుల తడకలవుతాయన్నది రూఢి.

పదార్థం గురించి తెలిపే విజ్ఞానశాస్త్రానికీ, పారమార్థికాన్ని గురించి వివరించే ఆధ్యాత్మికానికీ సంఘర్షణ ఎన్నడూలేదు. అపారసముద్రంతో పోల్చదగిన విజ్ఞానంలో మానవుడు సాధించిన మిడిమిడి జ్ఞానం ఒక నీటి బొట్టుతో సమానం. మన పరికరాలనుపయోగించడానికి వీలుకాని ప్రయోగాలద్వారా ఋజువు చేయబడజాలనివేవీలేవని తెలపడం విజ్ఞానశాస్త్రపు మూలసిద్ధాంతాలకే విరుద్ధం. అది అజ్ఞానుల లక్షణం. అన్నిఅపార్థాలకీ ఇదే యథార్థం. మన దినచర్యలో విశేషభాగం ప్రయోగాలకీ విజ్ఞానశాస్త్రమూలకవివరణాలకీ, అతీతం. కొన్నివిషయాలను వివరించడాన్కి విజ్ఞానశాస్త్రానికి పదజాలం కూడాలేదు. ఊహాకందని అద్భుతవిశేషాలు కూడా ఇట్లాంటివే. మనకున్న పరిమితమయిన విజ్ఞానంతోనూ, పరికరాలతోను వాటిని వివరించడానికసాధ్యం. కనుక వాటిని అద్భుతాలని వ్యవహరిస్తాం. అయితే వాటిని అబద్ధాలనీ, జరుగ కూడనివనీ చెప్పడం యథార్థవాదాన్కీ, హేతువాదానికీ విరుద్ధం. మనకున్న మిడిమిడి జ్ఞానానికవి నిదర్శనాలు.

వాతావరణంగూర్చి శాస్త్రజ్ఞులుచేసే ప్రవచనాలు సాధారణంగా జరగడంలేదని వాతావరణశాస్త్రాన్ని వెలివేస్తున్నామా? భారతదేశంలో పాశ్చాత్య సాంకేతిక పరిజ్ఞానం, పరిశ్రమలు నడిపించడం విఫలమయినందున పరిశ్రమలను స్థాపించడం మానుతున్నామా? గణుతికెక్కిన ఆర్థికశాస్త్రవేత్తలున్నప్పటికీ ప్రస్తుత ఆర్థికస్థితి అధ్వాన్న గతికిచేరినంత మాత్రాన ఆర్థికశాస్త్రం అభ్యసించడం మానివేశామా? విశ్వం పుట్టుపూర్వోత్తరాల గురించి జీవానికి మూలంగురించి ఇతరగ్రహాలపై జీవుల ఉనికి గురించీ ఊహిస్తునే ఉంటున్నాము. భౌతికజీవశాస్త్రంలోనూ, అంతరిక్షశాస్త్రంలోనూ చాలాసిద్ధాంతాలు ప్రస్తుతం మనం సంపాదించిన విజ్ఞానం ఆధారంగా మాత్రమే ప్రతిపాదించ బడ్డాయని మర్చి పోకూడదు. బ్లాక్‌హోల్సు, ఆంటీ మాటర్, కాసార్సు పల్సార్సు మొదలయిన పదార్థాలని అంతరిక్షపరిశోధనలో వాడుతూ, వాటిని గురించి ఊహిస్తున్నాం. ఊహకందకపోయినా అట్లాంటి సంఘటనలు భూమిమీద జరిగితే వాటిని విస్మరిస్తున్నాం. ఎంత ఎక్కువ తెలిపికోగల్గితే, అంత తక్కువగా అర్థం చేపికోగల్గుతాం, పదార్థాలను సృష్టించడం, శూన్యంలోంచివస్తువులను తెప్పించడం, గాలిలో తేలియాడడం లాంటివి తెలియని విషయాలు కావచ్చుగదా!

మానవుని తరచు వేధించే ప్రశ్నల్లో "అంతరిక్షంలో జీవకోటి ఉన్నదా?" అనేది ఒకటి. ప్రాణం అంటే ఏమిటో? ప్రాణుల అంతరార్థం ఏమిటో? మనకు అర్థం అయినది అత్యల్పం. బొగ్గు, నత్రజని, ఆమ్లజని, ఉదజని

లేకుండా జీవకోటి ఉండగలదా? ఈ మూలపదార్థాలు లేకుండా, బోరాన్, సిలికాన్ మొదలయిన ఇతరమూలపదార్థాలు, ఆధారంగాజీవకోటి సృష్టిసాధ్యమా? ఒకవేళ అట్లాంటి జీవకోటి ఉండడమే సాధ్యమైతే వాటి ప్రవర్తన ఏతీరున ఉండగలదు? భూమిమీద జీవకోటికి బొగ్గు, ఉదజని, అమ్లజని, నత్రజని ఆహారంగాబట్టి ఇతర గ్రహాలపై కూడా అవే మూలపదార్థలు ప్రాణుల సామాన్య జీవనాని కవసరమవుతాయా? భూమ్యేతర గ్రహాలపై ప్రాణికోటి ఉన్న పక్షంలో వాటికిభూమ్మీద ఉన్న జీవుల కంటే తెలివితేటలు ఎక్కువ ఉండవని భావించవచ్చునా? ఇట్లాంటి ప్రశ్నలు మూర్ఖత్వమని త్రోసి వేయడం భావ్యమేనా?

పైన చెప్పబడిన ప్రశ్నలే కాక ఈ క్రింది ప్రశ్నలు కూడా మానవ మేధను వేధిస్తూనే ఉన్నవి. మానవుని మనస్సు ఎట్లా పనిచేస్తున్నది? ఈనాడు మనం మానవుని మనస్సు అర్థం చేసుకోవడానికున్న దాఖలా ఏమిటి? జాగృత్, స్వప్న, సుషుప్తి అవస్థల్లో మానవుని ఆలోచనకు మూలమైన లక్షణాలను, కారణాలను మనం అవగతం చేసుకోగల్గితిమా? మానవుని ఆలోచన యంత్రాంగం మీద అనేక ప్రయోగాలు జరుగుతున్నాయి. అయితే ఆ ప్రయోగాలు అతని ఆలోచనాసరళిమీద, నైసర్గికస్థితిమీద ప్రభావం చూపక, శుద్ధమైన ఫలితాలనిస్తున్నవా? అసమగ్రమైన పరికరాలతోనూ, అసంపూర్ణంగా అర్థం చేసికొన్న జ్ఞానంతోనూ ప్రాణికోటి జీవనరీతుల గురించి ప్రస్తుతం జరుపుతున్న పరిశోధనలు ఇచ్చే ఫలితాలు ఎంతవరకు సరియైనవి. ఈ విషయాలను వివరించడానికి సరిపోయే పదజాలమైనా కనీసం మనవద్దనున్నదా? గొప్ప శాస్త్రజ్ఞులూ, తత్వవేత్తలూ ప్రస్తుత విజ్ఞానపు పరిమితి తెలిసికొన్నవారవడంవల్ల మాత్రమే పేరు ప్రతిష్ఠలనొందగలిగారు. నిజమయిన శాస్త్రజ్ఞుడు విశ్వాన్ని అర్థం చేసికోవడానికి పరిపూర్ణమైన, నిస్సంకోచమయిన మనస్సుతో వీలయినంత కృషి సల్పుతాడు. దీనిని గణిత శాస్త్రంలో పరిమితి తెలిసీ, తెలిపే పద్ధతితో పోల్చవచ్చు. అనంతాన్ని వివరించడానికసాధ్యమయినప్పటికీ గణిత శాస్త్రజ్ఞుడు దాని లక్షణాలను వివరిస్తాడు. కానీ అనంతం వివరణకసాధ్య కాబట్టి ఆ లక్షణాలను నిర్లక్ష్యం చేస్తున్నామా? గగన సదృశమయిన అనంతవిశ్వాంతరాళపు రహస్యాలను ఛేదించడానికెట్లా ప్రయత్నిస్తున్నామో, సత్యాన్ని అర్థం చేసుకోవడానికి సలిపే మన ప్రయత్నాలూ అట్లానే సాగిపోవాలి.

సత్యమంతా సాపేక్షమయినదే; సత్యం అనే గమ్యం చేరుకోవడం అసాధ్యమనిపించినా దాన్ని చేరుకొందుకు చేసే ప్రయత్నాలు మానముకదా; ఈ విషయాన్ని గుర్తించితే విజ్ఞానశాస్త్రానికీ, ఆధ్యాత్మికానికి సంఘర్షణ ప్రసక్తి లేదు. నిజమయిన శాస్త్రజ్ఞుడు పిసరైన ఆధ్యాత్మిక వాది కూడా, అనాదిగా ఋషులూ, తత్వవేత్తలూ సత్యాన్ని అర్థం చేసుకొని, దానిని చేరడానికి ఎట్లా కృషి చేశారో, నిజమయిన శాస్త్రవేత్త కూడా సత్యాన్ని చేరడం అసాధ్యమనిపించినా, తన ప్రయత్నాలు తాను సాగిస్తూనేఉంటాడు.

సత్యాన్వేషణకి సారం ఎట్టి భావాలులేనిమనస్సు. ఏవో భావాలతోగానీ, అనుమానంతోగానీ, మిడిమిడి జ్ఞానంతోగానీ, నిండిన మనస్సులు స్వేచ్ఛగా ఆలోచించ జాలవు. సత్యాన్ని పొందగోరువారు పరిసరాల బంధాలను త్రెంచుకోవడం చాలా ముఖ్యం. సత్యాన్ని సాధించాలనుకున్నవారు తమ అనుభవాలనుండీ ఇతరుల అనుభవాలనుండీ పాఠం నేర్చు కొందుకు తమ చిత్తాలను తెరచి ఉంచుకోవాలి. అనుమానం, అలసత్వం, ఇతరులను ఖండించడం అనేవి అశాస్త్రీయాలు. ఆ బంధాలనుండి త్రెంచుకొన్నవాడే నిజ

మయిన సత్యాన్వేషి. సత్యాన్వేషి విజ్ఞానశాస్త్రవేత్త కావచ్చు, ఆధ్యాత్మికవేత్తకావచ్చు.

విజ్ఞానశాస్త్రం ఆధ్యాత్మికం విశ్వవ్యాప్తమయినవి. ప్రజాస్వామ్యపరమైనవి. అవి అధికారంతోగానీ, ఎక్కువ తక్కువలతోగానీ ముడిపడనివి. నిరంకుశత్వం కల్గించే అడ్డంకులవల్ల విజ్ఞానశాస్త్రప్రగతికి హాని కల్గుతుంది. భారతదేశంలో ప్రాచీనకాలంనుండీ గొప్ప గొప్ప ఋషులూ, తత్త్వవేత్తలూ తమ శిష్యులనూ, అనుయాయులను తమ సందేశములను గుడ్డిగా నమ్మక, సందేహాలుకల్గినప్పుడు ప్రశ్నించి ఆయా అనుమానాలు తీర్చుకోమని బోధించేవారు. బాబావారి దివ్య బోధకూడ, దీనికి అనుగుణంగానే ఉన్నది. ఆ విధంగా వారు జ్ఞానసముపార్జనలో గానీ, బోధనలో గానీ, అత్యంత స్వేచ్ఛను తమ అనుయాయుల కొసగే వారు. పాశ్చాత్యవిజ్ఞానశాస్త్రసాంప్రదాయం కూడా స్వేచ్ఛగా ఆలోచించడాన్ని నొక్కి చెప్పింది. ఆ రకంగా చూపినా శాస్త్రవేత్తయినా, తత్త్వవేత్తయినా అన్వేషించేది సత్యమేననీ ఆధ్యాత్మికం, విజ్ఞానశాస్త్రం ఆ విధంగా సత్యాన్వేషణనే బోధించుతాయనీ ఋజువవుతోంది.

—శ్రీధర రామచంద్ర.

## "తెలిసికొనవలసినది"

ఇహపరసుఖములననుభవించుటయే మానవజీవితపరమావధికానేరదు. ఈ లోకమున ఎన్ని భోగభాగ్యములున్నను దుఃఖమిశ్రితసుఖమునే మనము అందుకొనగలము. కానీ, నిత్యశాంతిని ప్రసాదించు నిరతిశయానందమును పొందజాలము. "మరవవలసిన దానిని మరచినప్పుడే మనకు దుఃఖనివృత్తి. తెలిసికోవలసిన దానిని తెలిసికొన్నప్పుడే మనకు ఆనంద ప్రాప్తి" అని బాబా అన్నారు. మరవవలసినవి అనిత్య, అసత్యములగు ఇహపరసుఖములు. తెలిసికొనవలసినది ఆత్మతత్త్వము. అదియే ఆత్మసాక్షాత్కారము.

బాబా ఉపన్యాసము ప్రారంభించినప్పుడు మనలను "ఆత్మస్వరూపులారా" అని సంబోధిస్తుంటారు. ఆత్మస్వరూపులమగు మనము జన్మార్జిత కర్మలననుసరించి తిరిగి జన్మమెత్తి మరల కర్మలను జేయుచున్నాము. 'కర్మతో జన్మ, మరల జన్మతో కర్మ' అను విషవలయమున చిక్కుకొని అనేకయాతనల ననుభవించుచున్నాము. స్వస్థానమగు పరమాత్మ నుండి వేరు పడి గతితప్పి, మతితప్పి ఈ దుర్గతికి చేరుకున్నాము. స్వస్థానమును కోల్పోయిన దుస్థితిలో మనము శరణార్థులము (Refugees) గదా!

ఈ లోకము శరణార్థులమగు మనకు ఒక అనాథ శరణాలయము. దీనిని భోగాలయముగ భావించుట ఎంతటి అవివేకము! స్వస్థానభ్రష్టులమైన మనకు ఇది తాత్కాలిక నివాసముమాత్రమే! అట్టి స్థలమును మనదిగా భావించుకొని దానియందు మోహపడుట శోక కారణము కానేరదా! పునః మనము మన నిజస్థానమునకు చేరవలెను. శరణార్థులమైన మనము సాయి గురునాథునికి శరణాగతులము కావలెను. అప్పుడు మనము తప్పక చేరవలసిన గమ్యమును చేరగలము. మనము పోగొట్టుకొనిన సొంత ఇంటిలోనికి మనలను

తిరిగి చేర్చుటయే మన జగద్గురు అవతారలక్ష్యములలో ప్రధానమైనది. దిక్కుతోచక శరణార్థులమై ఈలోకమున తిరుగాడుతున్నాము. కనుకనే బాబా మనకు (why fear when I am here) "నేనుండగ ఎందుకుభయము"? అని అభయమిచ్చుచున్నారు.

ఇట్టి అభయ ప్రదాత మనకు లభించినందుకు నిజముగ మనము ఎంతో ధన్యులము; కృతార్థులము. మనమే కాదు, పాపభూయిష్ఠమని పురాణేతిహాసములచే గర్హించబడిన కలియుగమే ధన్యమైనది.

మానవపరమావధియైన కైవల్యసాధననిమిత్తమై బాబాపేరుతో అనేకపారమార్థికకార్యక్రమములు జరుగుచున్నవి. ఆధ్యాత్మికసాధనకొఱకు కనీసపు అవసారాలతో కూడిన సుఖమయజీవితము కోరుటలో దోషములేదు. అట్టి భౌతికసుఖమును కల్పించగల లౌకికజ్ఞానము, భౌతికజ్ఞానమును తదితరకళలను అభ్యసించుటకు విద్యాలయములు ప్రారంభింపబడుచున్నవి. ఆత్మతత్త్వవిచారణకొఱకును అంతరాత్మ అభ్యున్నతికి అనువైన సావకాశములను కల్పించగల (Summer Courses) వేసవితరగతులు జరుపబడుచున్నవి.

లౌకికాతీతమైన 'చదువుల సారాన్ని' అందించే ఈ వేసవితరగతులలోని అధ్యయనవిధానం విద్యార్థులలో విశిష్టమైన జీవనదృక్పథాలను కలిగిస్తాయి అని సుప్రీం కోర్టు జడ్జి శ్రీ వి. ఆర్. కృష్ణ అయ్యర్ గారు 1979 వేసవితరగతుల ప్రారంభోపన్యాసములో అన్నారు. వేసవితరగతులలో బాబా "విజ్ఞానానికి ఫలం స్వాతంత్ర్యం, జ్ఞానానికిఫలం ప్రేమ, సంస్కృతికిఫలం సమగ్రత్వం, విద్యకుఫలం శీలం." అను మహోత్కృష్ట జీవితలక్ష్యములను మనహృదయఫలకములపై ముద్రించారు. హృదయశుద్ధితోపాటు యథార్థభక్తి, నిస్వార్థప్రేమ, సేవానిరతిమొదలగు సులక్షణములను పెంపొందించుటకు భజనలు, సేవాసంక్షేమకార్యక్రమములు విశ్వవ్యాప్తముగ అనేకములు జరుపబడుచున్నవి. సమాజములోని కలుషితవాతావరణము నవయౌవనుల లేతహృదయములను సోకకుండ బాబా పేరున నిర్వహించబడు అనేకసంస్థలలోను కార్యక్రమములలోను యువకులే ప్రధానపాత్ర వహించుచున్నారు. ఈ ప్రకారము చెడును నిరోధించుటయేగాక నిర్మూలించుటయు (Prevention and cure) జరుగుచున్నది. సత్యసాయిసంస్థలు నిర్వహించు ప్రతి కార్యము ఈశ్వరోన్ముఖము చేయబడుచున్నది. నిజమునకు ఈశ్వరసంబంధములేని ఏ లౌకికకార్యమైనను అపచారముగ భావించవలెననునది సనాతనధర్మమూలసూత్రము. "వాసుదేవస్సర్వమితి" "ఈశావాస్య మిదం సర్వం" అని శాస్త్రములు ఘోషించుచున్నవి. మనము చేయు సమస్తకార్యములను కృతజ్ఞతాభావముతో ఆ జగత్ప్రభువుకైంకర్యమునకే తోడ్పడవలెననునది సాయినాథుని సర్వోత్తమసూక్తి. "భుఙ్జతే తేత్వఘం పాపాయే పచన్త్యాత్మకారణాత్" ఎవరు తమ నిమిత్తమే భుజించుచున్నారో (విషయములను అనుభవించుచున్నారో) అట్టి వారు పాపమును తినువారే యగుదురు అని గీతావచనము. దైవప్రసక్తి లేని విషయభోగము (భవ)రోగకారణమగును.

ఈశ్వరప్రాప్తికి విషయము (లౌకికకార్యము) ఒక ఉపకరణము మాత్రమే; కాని అది లక్ష్యముగా మన కృషి రూపొందరాదు. అందువలననే బాబా "మనము అన్నములో (విషయచింతనలో) జీవించరాదు. ఆత్మలో (దైవచింతనలో) జీవించవలె"నని ఉద్బోధించిరి. విషయమును విషయభోగముకొరకే మనము అనుభవించితిమా అది విషతుల్యమై మనలనే అది అనుభవించును (నాశనపరచును). అట్లుగాక దైవార్పిత బుద్ధితో మనము దానిని స్వీకరించినచో విషయము

ఆత్మవికాసమునకు తోడ్పడును. భవబంధవిముక్తికి దోహదపడును. ఇదియే సాయిపథసారాంశము. సహృదయులకు సర్వతాపోపశమనశీతలోదకము.

"చింతయామ్యహం శ్రీసత్యసాయినామం
భక్తరక్షకం భవరోగనాశకం
పర్తినివాసం శ్రీసద్గురుదేవమ్॥"

—డి. వి. కృష్ణారావు.

## గ్రంథప్రకటనకారులకు సూచన

భగవాన్ శ్రీ సత్యసాయిబాబావారికి సంబంధించిన గ్రంథములను ప్రకటించే మన ప్రాక్ దేశికభాషాసమితులు గమనింపవలసిన ఒక ముఖ్య నిబంధన: ముద్రించుటకుమొదలే, శ్రీ సత్యసాయి బుక్స్ అండ్ పబ్లికేషన్స్ వారి లిఖితానుమతిని పొందవలెను.

## పుస్తకములు

| | పేరు | వెల | తపాల ఛార్జి |
|---|---|---|---|
| 1. | అద్భుతమూర్తి—(హవార్డ్ మర్ఫెట్ ఆంధ్రానువాదం—అమరేంద్ర) | 6-00 | 0-10 |
| 2. | ఆత్మారామం | 5-00 | 0-45 |
| 3. | ఆధ్యాత్మికదీపిక | 2-50 | 0-20 |
| 4. | గీతావాహిని | 3-50 | 0-25 |
| 5. | జ్ఞానవాహిని | 1-00 | 0-10 |
| 6. | ధర్మవాహిని | 1-25 | 0-15 |
| 7. | ధ్యానవాహిని | 1-50 | 0-15 |
| 8. | ప్రశాంతివాహిని | 1-00 | 0-15 |
| 9. | ప్రేమవాహిని | 1-00 | 0-15 |
| 10. | భాగవతవాహిని | 3-00 | 0-25 |
| 11. | మణిమాల | 2-00 | 0-20 |
| 12. | వచనామృతము (2) | 2-50 | 0-30 |
| 13. | సత్యం శివం సుందరం (1) | 5-00 | 0-35 |
| 14. | సత్యం శివం సుందరం (2) | 7-00 | 0-35 |
| 15. | సత్యం శివం సుందరం(3) | 5-00 | 0-35 |
| 16. | సందేహనివారిణి | 2-00 | 0-20 |
| 17. | సూక్తిరసతరంగిణి (ఉప్పాడ రాజారావు) | 2-00 | 0-25 |
| 18. | శ్రీ సత్యసాయీశ్వర నుతితరంగిణి (1) (ఉప్పాడ రాజారావు) | 3-00 | 0-35 |
| 19. | శ్రీ సత్యసాయీశ్వర నుతితరంగిణి (2) (ఉప్పాడ రాజారావు) | 2-00 | 0-25 |
| 20. | సువర్ణసుమమాల | 5-00 | 0-30 |
| 21. | శ్రీ సత్యసాయి వచనామృతము (1) | 3-00 | 0-35 |
| 22. | శ్రీ సత్యసాయివచనామృతము(3) | 2-00 | 0-20 |
| 23. | శ్రీ సత్యసాయిదివ్యబోధ | 2-00 | 0-20 |

కర్ణాటక రాజ్యపు బెంగుళూరు_67, బృందావనములోని 'వ్రజ్ బృందావన్ ప్రెస్' నందు పి. చంగ్‌కకోటిచే ముద్రింపబడి, యన్. కస్తూరిచే, "శ్రీ సత్యసాయి బుక్స్ అండ్ పబ్లికేషన్స్, శ్రీ సత్యసాయి సెంట్రల్ ట్రస్ట్" ప్రశాంతి నిలయము, తరపున ప్రచురింపబడినది. ఎడిటర్ : యన్. కస్తూరి. యం. యే., బి. యల్.

## శ్రీ సత్యసాయి బుక్స్ అండ్ పబ్లికేషన్స్, శ్రీ సత్యసాయి సెంట్రల్ ట్రస్ట్, ప్రశాంతినిలయము,

పత్రికలు — పుస్తకములకు ఆర్డర్లు.

(1) పత్రికలు : ఒక సం॥కు తక్కువ కానీ 5 సం॥ల కెక్కువకానీ చందాలు స్వీకరింపబడవు.

ఇండియా

| | | | వార్షిక చందా |
|---|---|---|---|
| మాస పత్రిక | సనాతన సారథి | ఇంగ్లీషు | 6 రూ. |
| మాస పత్రిక | సనాతన సారథి | తెలుగు | 6 రూ. |
| త్రైమాసిక పత్రిక | సేవాదళ్ | ఇంగ్లీషు | 4 రూ. |
| త్రైమాసిక పత్రిక | శ్రీ సత్యసాయి బాలవికాస్ | ఇంగ్లీషు, హిందీ (ఒకే పత్రికలోనే) | 5 రూ. |

విదేశములు

| | సనాతనసారథి | | సేవాదళ్ | | బాలవికాస్ | |
|---|---|---|---|---|---|---|
| | సీమెయిల్ | ఏర్ మెయిల్ | సీమెయిల్ | ఏర్ మెయిల్ | సీమెయిల్ | ఏర్ మెయిల్ |
| | రూ. | రూ. | రూ. | రూ. | రూ. | రూ. |
| ఆఫ్ఘనిస్థాన్ | 16 | 26 | 9 | 12 | 9 | 12 |
| ఆఫ్రికా | 16 | 46 | 9 | 18 | 9 | 18 |
| అమెరికా | 16 | 51 | 9 | 20 | 9 | 20 |
| ఆసియా ఖండపు దేశములు | 16 | 31 | 9 | 14 | 9 | 14 |
| ఆస్ట్రేలియా | 16 | 46 | 9 | 20 | 9 | 20 |
| బర్మా | 16 | 26 | 9 | 12 | 9 | 12 |
| యూరప్ ఖండపు దేశములు | 16 | 46 | 9 | 18 | 9 | 18 |
| పసిఫిక్ సముద్ర ప్రదేశములు | 16 | 51 | 9 | 20 | 9 | 20 |
| శ్రీలంక | 8 | 21 | 8 | 10 | 8 | 10 |

(2) సనాతన సారథికి చందా పంపునపుడే ఏభాషలో (తెలుగు, ఇంగ్లీషు) కావలెనో తెలుపవలయును. చందా గడువు పొడిగించు సమయమునందును, మీ అడ్రస్సు నందు మార్పు అవసరమని తెలుపు సమయము నందును చందా నంబరును వ్రాసి పంపవలయును.

B (1) పుస్తకములు : ప్రస్తుతము మా యొద్ద నున్న పుస్తకములు, వాటి వెలలు, ఇండియాలోని వాటి పోస్టు ఛార్జీలును క్రింద తెలియజేయబడినవి. రిజిస్టర్డ్ పోస్టులో మాత్రమే పుస్తకములు పంపబడును. కాన రిజిస్టర్డ్ ఛార్జీ రూ 2-25 లు మీ ఆర్డరుతో పంపవలసియున్నది. V.P.P. ద్వారా పంపబడవు.

(2) పుస్తకముల పూర్తి పేర్లు అవి ఏ భాషలో కావలయును అనునది స్పష్టముగా ఆర్డరులోనే తెలుపవలయును.

(3) ఫోటోలు/చిత్రములు పోస్టులో పంపుటకు వీలు కాదు.

(4) కార్యాలయమునుంచి వివరములు తెలుసుకొనవలెనన్న మీ చిరునామాగల స్టాంపు వేసిన కవరును పంపవలయును.

(5) పుస్తకముల ఆర్డరులు—విదేశములనుంచి తపాల ఛార్జీలు ఎంత అని ముందుగనే వ్రాసి తెలుసుకోవలెను.

(6) చందా మొత్తము కానీ, పుస్తకములకొరకు పైకము కానీ, శ్రీ సత్యసాయి బుక్స్ అండ్ పబ్లికేషన్స్, ప్రశాంతినిలయము, అనంతపురం జిల్లా ఆంధ్ర ప్రదేశ్-పిన్:515134, యొక్క చిరునామాకే పంపవలయును. మనియార్డర్ పంపువారు వెనుకభాగమందు తమ చిరునామాను పూర్తి వివరములతో స్పష్టముగా వ్రాయవలయును.

(పుస్తకసూచి 120వ పుటలో చూడండి)

Regd. No. KRNU—83 MAY 1980

అవతారతత్త్వం తెలిసికోదలచిన సాధకుడు మనస్సును పదను చేసికోవాలి. పంట చేలను రైతులు బాగుచేసికొన్నట్లు, ముళ్ళపొదలూ, పిచ్చి తీగలు, నేలలో పాతుకొన్న వేళ్ళూ తొలగించాలి. తరువాత దుక్కి దున్నాలి. నీరు పట్టి విత్తనాలు జల్లాలి. నారు మడులకూ, లేత మొక్కలకూ, తెగుళ్ల తగులకుండా, మేకలూ పశువులూ పాడు చేయకుండా చుట్టూ కంచెలు వేసి కాపాడుకోవాలి. అట్లాగే, హృదయ క్షేత్రం నుంచి అహంకారమూ, గర్వమూ, దురాశా ఏరి పార వేయాలి. జపమూ, ధ్యానమూ ఆ పొలమును దున్ని పదను చేయగలవు. ప్రేమ అనే నీటితో బాగా తడపవలెను; నేల మెత్తపడి పదనెక్కుతుంది. నామమనే విత్తనం వేయాలి. భక్తి మొలకలెత్తాలి. కామక్రోధాలు పంటను చెడగొట్టే పశువులు. క్రమశిక్షణ అనేది పొలంచుట్టూ వేసే కంచె. ఆనందమనేది జీవనాధారమైన పంట.

-బాబా

Regd. with Registrar of Newspapers No. RN/10772/64